# సమానత్వ మెక్కడ?



రచన

## మల్లాది సుబ్బమ్మ




స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
౮, ఎం. ఐ. జీ. హెచ్. కాలనీ, మెహదీపట్నం
హైదరాబాద్-500028

# కరపత్రం నెం. 33

ప్రతులు 2000
తొలి ముద్రణ : 1990



రచన : మల్లాది సుబ్బమ్మ




ప్రచురణ కర్త
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
మెహిదీపట్నం—హైదరాబాద్
ఫోను : 35429

వెల : రు. 6-00

ప్రతులకు :
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
9. ఎం. ఐ. జి. హెచ్ మెహిదీపట్నం
హైదరాబాద్-500 028

ముద్రణ :
సౌజన్య ఆర్టు ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3.

# సమానత్వమెక్కడ?

ఆ ఊరి పేరు రామాపురం దానికి ఒక ప్రక్క కొండ వాగు పారుతున్నది. మరో ప్రక్క చిన్నకొండ ఉన్నది. గ్రామంలో వెయ్యిగడప ఉంటుందంటారు. దానిని ఆనుకొని దక్షిణాన రెండు పల్లెలు వున్నాయి. ఒకదానిని పాతబస్తీ అంటారు. రెండో దానిపేరు క్రొత్తబస్తీ. రెండు బస్తీలవాళ్లు ఒక కులంవారే కాని వాళ్ళు పిల్లలను ఇచ్చిపుచ్చుకోవడాలు లేవు. చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళు రామాపురం మంచి గ్రామమే అని అనడం ఆనవాయితీ.

ఆరోజు ఉదయం పాతబస్తీలో అమ్మలక్కలు నిద్ర లేచి ఇళ్ళముందు కళ్ళాపి చల్లారు. బర్రెలకు పాలుతీసి దూడలను విడిచారు. ఇళ్ళల్లో మగవాళ్లు పొలాలకు వెళ్లారు ఆడంగులు వంట ప్రయత్నం చేయబోతున్నారు. సూర్యుడు తన కిరణ కాంతులను వెదజల్లుతున్నాడు. కొందరు ముసలమ్మలు ఇళ్ళ వాకిట తీరిగ్గా కూర్చుని పళ్ళు తోముకుంటున్నారు. ఇంతలో పెద్ద కలకలం, అందరు మనుష్యులు ఒక్కసారి మాట్లాడుతున్నట్లు జనఘోష, వాగు వచ్చేముందు వినిపించే రొదలాగుంది ఆ ధ్వని. ఇది విని రంగమ్మ ఇంటినుండి వీధిలోకి పరుగెత్తుకొచ్చింది. చిన్న పిల్లలు పరుగెత్తిపోతున్నారు. అందరూ బస్తీ పెద్ద వెంకన్న ఇంటివైపు వెళుతున్నారు. మాటలు అస్పష్టముగా వినపడుతున్నాయి. "దొరసానులు వస్తున్నారు"

"చిన్న దొరసాని నడచి వస్తున్నది"

"బుల్లి దొరసాని కూడా ఆమె వెంబడి వున్నది"

"వాళ్ళు వెంకన్న భార్య లచ్చమ్మతో మాట్లాడు తున్నారు"

"అదిగో చిన్న దొరసాని లచ్చమ్మనుదుటన కుంకుమ బొట్టు పెట్టింది"

రంగమ్మ ఈ మాటలు విని విస్తుపోయింది. "పోర గాళ్ళకు మతిపోయిందా అని ఆశ్చర్యపోయింది. దొరసాను లేమిటి? పాతబస్తీకి రావటమేమిటి ? ఎన్నడయినా జరిగి నదా? తను ఈ ఊరు కాపురానికి వచ్చి ఇరువయి సంవత్స రాలయింది. అసలు తను పెద్ద దొరసానిని చూడలేదు. ఆమె మేనాలో వెడుతుంది. చిన్న దొరసాని జోడెద్దుల బండిలో పరదాలు కట్టించుకొని ప్రయాణం చేస్తుంది. బుల్లి దొరసాని కారులో పట్నం వెళ్ళి చదువుకుంటున్నది. ఇలా చెప్పు కుంటారు. అసలు తను వాళ్ళను చూడనేలేదు. తనెప్పుడూ గడికి వెళ్ళలేదు. అమ్మో! గడికి పోవడమే! ఏదన్నా తప్పు చేస్తే గడికి పిలిపిస్తారట " రంగమ్మ ఇలా ఆలోచించుకుంటూ ఉంటే సీతాలు ఆమె వైపు పరుగెత్తుకుంటూ వచ్చింది. "అత్తా!, దొరసానులు మన వీధిమూల తిరిగారు. మన ఇంటికే వస్తారు" అని కేక పెట్టింది. ఆకేకలో సంతోషంభయం

రెండూ ఒక్కసారిగా ధ్వనించాయి. రంగమ్మ ఉలిక్కి పడింది.

"ఇంతకు ఎందుకు వస్తున్నారు?" అని సీతాలును అడిగింది.

"నీకు తెలియదా? వోట్లు అడగటానికి వస్తున్నారు. దొరగారు ఎం. ఎల్. ఏగా నుల్చుంటారట!" అంది సీతాలు.

వోట్లు అనగానే మొన్నరాత్రి బడిలో పంతులమ్మ కరుణమ్మ చెప్పిన పాఠం గుర్తుకు వచ్చింది రంగమ్మకు. అప్పుడు కరుణమ్మ టీచరు ఏదో బాగానే చెప్పింది కాని తనకు అంతు పట్టలేదు. చంకలో పిల్లాడు గుక్కపెట్టి ఏడుస్తూండడంతో మధ్యలో తను ఇంటికి వచ్చేయాల్సి వచ్చింది. ఇలా ఈజ్ఞాపకాలను నెమరు వేసుకుంటుంటే ఎవరో తన భుజం మీద చెయ్యి వేశారు. గబుక్కున వెనక్కు తిరిగింది రంగమ్మ.

ఎదురుగా కరుణమ్మ టీచరు. "రంగమ్మా! ఏమిటి ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" అని అడిగింది కరుణమ్మ.

తన అనుమానాలను గురించి వివరించింది రంగమ్మ. చిరునవ్వు నవ్వి కరుణమ్మ ఇలా అంది, "ఈ రాత్రి వోటు కథ మొన్నటి కన్నా బాగా రంజుగా చెప్తాలే. తప్పకరా. ఫాతబస్తీ ఆడంగులు అందరూ రావాలి సుమా। మరచిపోకు

ఈసారి పోరగాణ్ని మీ ఆయనకు ఇచ్చిరా. సమదాయిస్తా డు తే. ఒక్క పూట సర్దుకో లేడా ఏం?"

ఎప్పుడు చీకటి పడుతుందా, ఎప్పుడు రాత్రి బడికి వెళ్దామా, ఎప్పుడు వోట్ల కథ విందామా అని రంగమ్మకు ఒకటే ఆరాటం. చీకటి పడింది. భర్త పొలంనుంచి వచ్చాడు, అతనికి అన్నపానాదులు సమకూర్చింది ఆమె. పోరగాణ్ణి ఆయన ఒళ్ళో కూలవేసి "బడికి వెళ్లొస్తా కరుణమ్మ టీచరు తప్పక రమ్మన్నద"ని చెప్పి ఉరుకులు పరుగులతో చర్చివైపు పరుగెత్తింది రంగమ్మ. ఆమె వెళ్ళేటప్పటికే పది పదిహేను మంది స్త్రీలు అక్కడ గుమిగూడి ఉన్నారు. కరుణమ్మ టీచరు రంగమ్మను చూచి. "రంగమ్మా! రా! నీవు రాలేదనే ఇంకా నేను పాఠం మొదలు పెట్టలేదు" అంది. "అందరూ వచ్చారు" అంది వెంకటమ్మ.

"సరే మొదలు పెడ్దాం. ఇపుడు వోట్లుఎవరికివచ్చాయో చెప్పండి విందాం?"

21 సంవత్సరాల వయస్సు నిండితే వోటు వస్తుందని రెండుసార్లు వోటు వేసిన చంద్రమ్మ బదులు పలికింది.

"అది పొరపాటు అత్తా! మొన్న, ఇటీవల 18 సంవత్సరాలు దాటిన వాళ్ళందరికీ వోట్లు ఇచ్చారు" అనిధీమాగా పలికింది అయిదో క్లాసు దాకా చదివిన అరుంధతి. "నిజమే నమ్మా! ఇపుడు 18 సం॥ నిండిన వాళ్ళందరికీ అంతే

స్త్రీలకూ, పురుషులకూ, వోటువేసే అర్హత ఉంది. హక్కు వచ్చింది."

"అయితే దొరగారికి ఎన్నివోట్లు ఉంటాయి? మన పల్లెపెద్ద వెంకన్నకు ఎన్నివోట్లు? మామామకు ఎన్నివోట్లు?" అమాయకంగా ఇంతవరకు ఒక్కసారి కూడా వోటు వేయని రంగమ్మ అడిగింది అతి కుతూహలంతో. "రంగమ్మ అడిగిన ప్రశ్న చాల ముఖ్యమయింది. మన దేశంలో ప్రతి మనిషికి ఒక్క వోటు, దొర అయినా పాలేరు అయినా ఒకటే, గొప్ప భూస్వామి అయినా బక్కరైతు అయినా ఒకటే. కమ్మరి అయినా కుమ్మరి అయినా ఒక్కటే. ఆసామి అయినా కూలి మనిషి అయినా ఒకటే. "అంటే దొరగారు అంత గొప్పోళ్లు అయినా, దొరసానిగారు అంత ఠీవిగా అందంగా ఉన్నా నాలాగా ఆమెకు ఒక్క వోటే నన్నమాట?" రంగమ్మ విస్మయంతో అడిగింది.

"అంతే రంగమ్మా! ఎలెక్షనులు వస్తాయి తెలుసుగా! ఎవరికి ఎక్కువ వోట్లు వస్తే వారు నెగ్గినట్లు లెక్క. కనుకనే దొరగారి తరపున దొరసానిగారు వోట్లు అడగటానికి స్వయముగా కుంకుమ భరిణ చేతబట్టుకుని వచ్చారు."

"వెనకటి ఎన్నికలప్పుడు పేర్లు రాసుకుపోయిన చచ్చినోడు నాపేరు రాయలేదమ్మా! దాంతో నాకు ఓటు లేకుండా పోయింది. ఇపుడు ఓటర్ల జాబితాలో నా పేరుందని మా

బాబాయి చెప్పాడు. ఈసారి నేను తప్పక  ఓటు  వేస్తాను" సంతోషంగా ప్రకటించింది రంగమ్మ.

"ఐతే  గంతులేస్తున్నావు, ఎవరికి వేస్తావే నీవోటు?" మూల కూర్చున్నముసలిముత్తమ్మరంగమ్మను  ప్రశ్నించింది. "ఇంకెవరికి వేస్తాను. దొరసానమ్మ  కోరినవాండ్లకు  ఇస్తా నావోటు" అరిచినంత పనిచేసింది రంగమ్మ.

"ఏడిసినట్లే ఉంది నీ నిర్వాకం। ఆలోచించిమాట్లాడవే! మందలించింది ముత్తమ్మ. "ఇకనేను చెప్పేది  జాగ్రత్తగా వినండి. మొదట్లో అన్నిదేశాలలో వోట్లులేవు, ఎన్నికలులేవు రాజులు, జమిందారులు, దొరలు ఉండేవారు. వారు ఏం చెప్తే అదే చెల్లేది. కాలం మారింది. రాజులను తొలగించారు. ఆస్తి ఉన్న మగవాళ్ళకు మాత్రం వోటు ఇచ్చారు. తరువాత దస్కతు పెట్టగల వాళ్ళకు ఇచ్చారు. చివరకు స్త్రీలకు కూడా వోటు వచ్చింది మనదేశంలో" కరుణ చెప్పుకొని  పోతూ ఉంది.

"అంత ఆలస్యంగా ఎందుకు  ఇచ్చారు  ఆడవాళ్ళకు వోట్లు" అమాయకంగా అడిగింది రంగమ్మ.

"వోట్లు వచ్చాయి,  సంతోషించురంగమ్మా!  ఎంత మంది మహిళలు మహత్తర త్యాగాలు చేస్తేనో, ఎన్నో కష్ట నష్టాలు పడితేనో కాని మనకు  వోట్లురాలేదు" వివరించింది అరుంధతి.

"అంటే మనవాళ్ళు జైళ్ళకు వెళ్ళారా? లాఠీ దెబ్బలు తిన్నారా వోటుకోసం" ఈసారి ప్రశ్నించడం వెంకన్న భార్య లచ్చమ్మ వంతు అయింది.

"మనదేశం మీద ఒకప్పుడు బ్రిటిషువాళ్ళు పరిపాలించారు తెల్సుగా మీకు! మా కొద్దీ తెల్లదొరతనం అని మన పెద్దలు ఆడా, మొగా అందరూ 1930లో పాటలు పాడి, వీధుల్లో ఊరేగి, మీటింగులు పెట్టి, సభలు జరిపి, తీర్మానాలు చేసి చివరకు లాఠీదెబ్బలకు, జైలు శిక్షలకు కూడా గురిఅయినారు. అయితే స్త్రీల ఓటుహక్కు కోసం స్త్రీలు–అంటే మన దేశంలో స్త్రీలు అంతగా పోరాటం చేయలేదు. కాకపోతే ఆందోళన జరిపారు. సరోజినీ నాయుడు లాంటి నాయకులు గట్టిగా వాదించారు. మరి, మనకు ఎలా ఓట్లు వచ్చాయని మీరందరూ అనుకుంటున్నారు కదూ? అదే విచిత్రం, మనను పరిపాలించిన తెల్లవాళ్ళ దేశంలో స్త్రీలకు ఓటు కావాలని ఆదేశపు మహిళలు ఉధృతంగా పోరాడారు. వారికి ఓట్లు ఇవ్వక తప్పలేదు 1919లో. మనకూ వెన్వెంటనే వచ్చాయి ఓట్లు" కరుణ గంభీరంగా మాట్లాడింది.

"ఇంత కష్టపడి తెచ్చుకున్న ఓటును–కాదు ఇంత కష్టపడితే వచ్చిన ఓటును –నేను వృధాచేయను. మంచి వాళ్ళకే ఇస్తాను" ప్రతిజ్ఞ చేసే ధోరణిలో ప్రసంగించింది రంగమ్మ.

"అయితే మన అరుంధతికి ఇయ్యి నీ ఓటు" కోరింది ముత్తమ్మ.

"అంటే మనందరం దొరగారికి పోటీగా అరుంధతిని పెడ్దామంటారా?" సూటిగాఅడిగింది రంగమ్మ.

కరుణమ్మ గొంతు సవరించుకుంది "చూడండ్రా! మనం కొన్ని ముఖ్యమైన సంగతులు మాట్లాడుకోవాలి. పుట్టు కనుబట్టి మనం మనిషి మంచితనాన్ని అంచనా వేసుకోకూడదు. జన్మ ముఖ్యం కాదు. మనిషి గుణం ముఖ్యం. పెద్ద దొర మంచివాడే అనుకుందాము. ఆయన కొడుకు చిన్న దొర దుర్మార్గుడు కావచ్చు. మనిషి మంచితనం చేతల్లో కన్పిస్తుంది. ఆమాటకు వస్తే రంగమ్మా నీవు చెప్పు. మీ నాయన త్రాగివచ్చి మీ అమ్మను ఎలా మంచిగా చూచుకునే వాడు। మరి మీ అన్న త్రాగివచ్చి మీ వదినను రోజూ చావ బాదే వాడు కదా। కనుక వంశం గొప్పదని, కులం పెద్దదని, పైసలున్న మహారాజని, అందమున్న అమ్మాయని, మన కులపు మనిషి అని, మన ఊరి మనిషి అని ఇట్లా అభిమానాలు పెట్టుకోకూడదు. ఎవరు మంచిగా మనమనిషిగా మనకు కావలసిన సదుపాయాలు సాధిస్తారో వారే మన అభ్యర్థి కావాలి, ఆ మనిషి మనలో కలసి పోవాలి. మన మీద పెత్తనం చేయకూడదు. మనలను చులకన చేయకూడదు. మనకు చేయూతనిచ్చి మనల్ని ముందుకు నడిపించాలి" అని చెబుతూవుండగా మధ్యలో ఆనందం పట్టలేక ముత్తమ్మ చప్పట్లు కొట్టింది.

మగవాళ్ళు ఆడవాళ్ళకన్నా గొప్పకదా! మరి మన అరుంధతి మన ఊరి దొరగారు సమానమంటారా టీచరు గారూ?" ఇంతసేపూ మౌనం వహించి శ్రద్ధగా వింటున్న రత్తమ్మ తన సందేహాన్ని వెలిబుచ్చింది.

ఆడంగులంతా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. కరుణమ్మ ఏమి చెపుతుందో అని ఆతృతగా ఆమెవైపు చూస్తున్నారు.

కరుణమ్మ మొదలు పెట్టింది తన ఉపన్యాసం. "సమానమే! స్త్రీపురుషులు సమానమే, ఇద్దరికీ శరీరనిర్మాణం ఇంచుమించుగా ఒకటే. ఒకమాట చెప్తాను. శ్రద్ధగా ఆలకించండి, మీలో చాల మందికి దేవుని మీద నమ్మకం ఉందికదూ, మనం ఇపుడు చర్చిలో సమావేశం అవుతున్నాం కదా. జనులు అందరూ దేవుని బిడ్డలే కదా! అలాగే స్త్రీలు, పురుషులు ఇద్దరూ దేవుని సంతానమే. ఇద్దరిలోనూ పరిశుద్ధాత్మ అంశ ఉన్నది కదా! మరి సమానంకాక ఏమవుతాము. ఒకవేళ ఎవరికైనా దేవుని మీద నమ్మకం లేదనుకొందాము. ప్రతి మనిషికీ మెదడు ఉంది. ఆలోచనాశక్తి, జ్ఞాపకశక్తి. ఊహాశక్తి ఇన్ని ఉన్నాయి కదూ! స్త్రీ పురుషులందరికీ ఈ సత్తా ఉంది. కనుక ఇద్దరూ ఎలా ఆలోచించినా, సమానులే.

రత్తమ్మ ముఖంలో ఏదో అనుమానం కన్పడుతున్నది. పురుషుడు మోయగలిగినంత బరువు స్త్రీ మోయగలదా,

అతడు చేసినంత బండచాకిరీ ఆడమనిషి చేయగలదా అనే అపనమ్మకం ఆమెకు కల్గుతున్నట్లుంది. కష్టపడి బరువు పని చేయడం అలవాటు వల్ల వస్తుంది. ఇన్నాళ్ళు పురుషులు అలా చేయపట్టి వారికి బలమూ, బరువు మోసే శక్తి స్త్రీలకన్నా అధికంగా వచ్చాయి. అయినా ఆ మాటకు వస్తే మన బస్తీలో పొలం పొయ్యే ఏ ఆడపిల్లయినా చేతితో గట్టిగా విదలిస్తే పట్నవాసపు తెల్లచొక్కాలవాళ్ళు 100కి 80 మంది తూలి పోతారు. గోతులు త్రవ్వి తట్టలతో మన్ను మోసే మన వడియరాజ యువతుల కండబలం ముందు తతిమ్మా పురుషుల శక్తి ఎంత? అదిగో లచ్చమ్మ ఏదో అనాలని అనుకుంటు న్నది. ఆమె అనుమానం నాకు తెలుసు. కుడిచెయ్యి, ఎడమ చెయ్యి ఒకటేనా అని కొంతమంది మగవారు వేసే ప్రశ్న ఆమె మనసులో మెదలుతున్నది. అలవాటుగా ప్రతి పనీ కుడి చేత్తో చేస్తాం కనక కుడిచెయ్యి ఎడమచెయ్యి కన్న లావుగా వుంటున్నది. కొంతమంది ఎడమ చేతితో బరువులు ఎత్తుతారు. బంతి ఆట ఆడతారు. రాస్తారు, పంట కోస్తారు. మరి వారి ఎడమచెయ్యి కుడిదానికన్నా బలంగా వుంటుంది." కరుణమ్మ తను చెప్ప తలచుకున్నది తృప్తిగా చెప్పానని సంతృప్తిగా గాలి పీల్చుకున్నది.

"టీచరూ! నేను ఈ మధ్య ఒకటి చదివాను. మగ వాళ్ళ కన్నా వ్యాధి నిరోధకశక్తి మనకు 100కి 10పాళ్ళు

ఎక్కువట కదా! అంటే పురుళ్లు పోసుకునేటప్పుడు సరిగా చూచుకోకపోతే తప్ప ఆడవాళ్లు మగవాళ్ళకన్నా ఎక్కువ కాలం బ్రతుకుతారట.నిజమేనా?" తనజ్ఞానాన్ని వెలిబుచ్చింది అరుంధతి. కరుణమ్మ కనులు విప్పారాయి.

"అమ్మాయి అరుంధతి చెప్పిన విషయాలు అక్షరాల సత్యం. మరోమాట చెప్పి నేను ముగిస్తాను, అసలు ఇపుడు కాలం మారింది. కండబలం కన్న బుద్ధిబలం గొప్పది. అంత పెద్ద ఏనుగును మావటివాడు అంకుశంతో అదుపులో పెడు తున్నాడా లేదా? భారీ ఎత్తు ఎద్దులచేత మనం పొలాలు దున్నిస్తున్నామా లేదా? కాలినడక, కుర్రపు స్వారీ, రథ సారథ్యం, మోటారు వాహనాలు, విమానాలు ఇలా మనం మార్చుకరాలేదా? వేలకిలోమీటర్ల దూరాన వున్న దృశ్యాలు మనం చూస్తున్నాం దూరదర్శన్‌లో. లక్షల కిలోమీటర్ల దూరాన వున్న గ్రహాలకు వెళ్ళి వస్తున్న వాహకనౌకల సంకే తాలను వింటున్నాం. చంద్రుడిమీదికి ఒక స్త్రీ వెళ్ళి తిరిగి వచ్చింది తెలుసా? ప్రపంచంలో అన్ని శిఖరాలకన్నా ఎత్తయిన ఎవరెస్టు శిఖరంపైకి ఎక్కింది ఒక మహిళ. గుండెనిబ్బరం, చేతిలో తుపాకి వున్న నారీమణిని ఎదిరించి నిలవమనండి మామూలు పురుషుణ్ని. మీట నొక్కితే పది వేలమైళ్ళ దూరాన ఉన్న లక్ష్యాన్ని కొట్టగల శక్తివున్న అణ్వాయుధాలు వచ్చాయి. ఆ మీటను స్త్రీమాత్రం నొక్క

లేదా? పుట్టకురుపు వ్యాధిని రూపుమాపటానికి మ్యాడం క్యూరీ అనే మహిళ రేడియంను కనుగొనలేదా? ఇలా ఎన్న యినా ఉదాహరణలు చెప్పవచ్చును. ఇంతకూ నేను మిమ్మ లిని కోరేదేమంటే "మేము అబలలం, ఏమీ చేతకానివారం, పురుషులకన్న తక్కువవారం" అని అనుకోవటం మానుకో వాలి. ఇంతకన్నా నేను ఏమీ ఆశించను."

అందరూ చప్పట్లు కొట్టారు. హర్షాతిశయంతో, "ఎం ఎల్. ఎ. సీటుకు దొరగారికి పోటీగాఅరుంధతిని నిలబెడ్దాం" పెద్దగా అరిచింది రంగమ్మ, బలపరచింది రత్తమ్మ. ముత్తమ్మ ముఖంలో మునిసి ముసి నవ్వులు వెలిశాయి. అరుంధతి ముఖం కాంతివంతమయింది.

కరుణమ్మ ప్రకటించింది "ఇంతవరకు పురుషులు పరిపాలించారు. మన మూపాలకులం కాగలం, కావాలి. అరుంధతి మన అభ్యర్థి. ఆమెను గెలిపించుకుందాం. ఇది మనందరి బాధ్యత. మనందరం ఒక నెల రోజులు విధి విరా మం లేకుండా పనిచేయాలని ప్రతిజ్ఞ చేద్దాం"

అందరూ తయారుగా వున్నామన్నారు ఆ మహిళలు. అరుంధతి నేస్తం లత లేచి నిల్చొని పిడికిలి బిగించి నినాదా ల్చింది.

"స్త్రీ పురుషులు సమానులే!
మంచితనంలో గొప్పతనం ఉంది.

పురుషాధిక్య సమాజం అంతరించాలి.

స్త్రీలపై దౌర్జన్యం నశించాలి.

అరుంధతికే మీ ఓటు

స్త్రీల హక్కుల రక్షణకే మీ ఓటు"

అరుంధతి లేచి అందరికీ నమస్కరించింది. "నాకు పురుష ద్వేషం లేదు. నా తండ్రి, నా సోదరుడు, నా జీవిత సహచరుడు పురుషులు. మనం వారిని ద్వేషించం, కాకపోతే మమ్మల్ని సమానంగా చూడమంటాం, గౌరవించ మంటాము. సమాజరాజకీయవ్యవహారాలన్నిటిలో మీతో పాటు సమానంగా పాల్గొనటానికి మాకు హక్కు ఉన్నదంటాం అందుకే ఈ ఎన్నికల పోరాటం, అందుకే ఈ పోటీ."

ముత్తమ్మ అరుంధతి మూర్ధాన్ని మూర్కొన్నది. కరుణమ్మ అరుంధతి తల నిమిరింది. అందరూ ఆమెను ఒక్కొక్కరూ ఆమెను కౌగలించుకున్నారు.

"సమానత్వం వర్థిల్లాలి" అనే లత ఇచ్చిన నినాదంతో అనాటి సమావేశం ముగిసింది. ఆ స్త్రీల ముఖాలు జ్వాజ్వల్య మానంగా వెలిగిపోతున్నాయి. హాలు బయటికి నడిచిన ఆ స్త్రీలను చూచి పురుషులు చకితులయ్యారు.

* * *

గ్రామంలో తగాదాలు వస్తే ఇద్దరూ అంటే నేరారో షణ చేసే మనిషి. ముద్దాయి ఒకే కులానికి చెందిన వారయితే

ఆ కుల పెద్దలు పంచాయితీ చేసేవారు. అలా కాకుండా వేరు వేరు కులాలకు చెంది ఉంటే ఊరి పెద్దలు పంచాయితీకి కూర్చునేవారు. పెద్దదొర పెత్తనం చేసినన్నాళ్లు రామాలయం ప్రక్కన ఉన్నరావిచెట్టు అరుగుమీద పంచాయితీదార్లు కూర్చునేవారు. జనం దిగువున నేలమీద కూర్చునేవారు. చిన్న దొరకు వ్యవహారాలు వప్పచెప్పాడు పెద్దదొర. దాంతో పంచాయితీదార్ల సమావేశస్తలం మారింది. పంచాయితీవారు దొరగారి గడిలోనే కూడటం మొదలయింది. కులానికో పెద్ద చొప్పున దానికి హాజరయ్యేవారు. ఇలా సాగింది, సాగుతున్నది కొన్ని సంవత్సరాలుగా.

ఆరోజు దసరా పండగల్లో కనుము. స్త్రీ పురుషులెవ్వరు ఆనాడు పనుల్లోకి పోరు. ఆ దినం అందరి పనులకూ ఆట విడుపు అన్నమాట. సాయంత్రం నాలుగు గంటలయింది. రామాలయం రావి చెట్టు క్రింద జనం కూడటం మొదలు పెట్టారు. చిన్నపిల్లలు "రామాలయం దగ్గరపంచాయితీ" అని అరుస్తూ వీధులలో, బస్తీలలో పరుగెత్తుతున్నారు. ఇంతలో "పంచాయితీదార్లు వచ్చేశారు, వచ్చేశారు" అనేమాటలు విన బడినయి. ఎం. ఎల్, ఏ. ఎన్నికలలో చిన్నదొరగారు ఓడి పోయిన తరువాత రామాలయం వద్ద జరిగే ప్రథమ పంచాయితీ ఇది. సహజంగా ఇది ప్రజలలో కుతూహలాన్ని రేకెత్తించింది. చిన్న దొరగారు వచ్చి అరుగుమీద కూర్చున్నారు. మాజీమాలీపటేల్, ఆచార్రిగార్రు, పెదసెట్టి, పెదకాపు కూడా

అరుగుమీద దొరగారికి కొస్త వెనుకగా కూర్చున్నారు. వలయాకారంగా. రైతులు, పాలేర్లు వ్యవసాయ కూలీలు కూర్చుని ఉన్నారు. పోరగాళ్లు దూరంగా నిలుచుండిచోద్యం చూస్తున్నారు. అక్కడ ఉన్నవాళ్ళంతా మగవాళ్ళే. కాకపోతే ఒక్క ఆడకూతురు మాత్రం అరుగు క్రిందగా ఒక ప్రక్కన నిలబడి ఉంది. ఆమెప్రక్కన ఆమె తండ్రి కావోలు పాత బస్తీకి చెందిన రామయ్య చేతులు కట్టుకొని ఉన్నాడు. వేరొక వైపున వీరయ్య కనిపిస్తున్నాడు. అతనిలో ఠీవి, దర్పమూ దర్శనమిస్తున్నాయి.

చిన్నదొరగారు పలికారు, "పంతులుగారూ, ప్రారంభి ద్దామా" అంటూ. సభ నిశ్శబ్దమయింది. చీమచిటుక్కుమన్నా వినపడేటంత నిశ్శబ్దం. అందరి ముఖాల్లో ఆతురత తాండ విస్తున్నది. ఆ స్త్రీ కలవరపడుతున్నది. "వీరయ్యా! అసలు ఏం జరిగింది చెప్పు అందరి ఎదుటా" అన్నారుఆచారిగారు. వీరయ్య టూకీగా ఇలా చెప్పాడు.

"నేను నా తూర్పు పొలం వెళ్ళానండీ. మంగి నా చేను గట్టు మీద గడ్డి కోస్తున్నదండి. ఆమెను చూచి నేను ఆమె దగ్గరకు వెళ్ళానండీ నా అడుగుల సవ్వడి విని ఆమె లేచి నిలబడింది. "మీ నాయన రామయ్య ఈ ఏడు నా పాలేరుగా లేడుకదా! నాచేలో గడ్డికోయటానికి ఎందుకు వచ్చావు" అని అన్నానండీ. కాకపోతే గొంతు పెద్దది చేసి అన్నాను. అంతే ఆమె నన్ను నిర్లక్ష్యంగా చూచి వంగి

మళ్ళీ గడ్డికోయటం మొదలు పెట్టిందండీ. దాంతో నాకు కోపం వచ్చిందండీ. అయినా తమాయించుకుని "మంగీ! నీకే చెప్పేది! నా చేలోంచి పో!" అని అరిచానండీ. ఆమె తన పని ఆపి "ఏంటి సామీ! రైతులు గడ్డికోయ వద్దంటే మాగొడ్లు ఎలా బ్రతకాలి?" అని సమాధానం చెప్పింది. దాంతో నాకు చిరాకు ఎత్తింది. "మీరు ఎట్లా బ్రతుకుతారో, ఏమో నాకు అనవసరం. నా చేలో అడుగు పెట్టకూడదు. అంతే" అన్నాను. ఆమె నా మాటలు విననట్లు నటించి వంగి గడ్డి కోసుకుంటున్నది. నేను వెళ్ళి ఆమెను చెయ్యి పట్టుకొని ఆపి చేను బయటికి పొమ్మన్నాను. ఆమె తన చేతిలోని దోకుడుపారతో నన్ను నెట్టింది. ఇదిగో ఛాతీమీద కమిలిన భాగం చూడండి" అంటూ ఉత్తరీయం తీసి ఛాతీ చూపించాడు వీరయ్య. చర్మం చిట్లి ఉన్నది. గాయం లేదుకాని వాపు ఉంది. ముసలి రైతులు ముక్కుమీద వేలు వేసుకున్నారు. పాలేర్లు దిక్కులు చూడనారంభించారు. వ్యవసాయ కూలీలు తత్తర లాడుతున్నారు. వారి ముఖాల్లో భయాందోళనలు ద్యోతకమవుతున్నాయి. ఇది "దేనికి దారి తీస్తుందో" అని తల్లడిల్లి పోతున్నారు.

చిన్నదొర "మంగీ! వీరయ్య చెప్పినదానికి ఏమంటావు?" అన్నాడు.

"నన్ను మంగమ్మ అని పిలుస్తారండీ అందరూ" అన్నది ఆ ఆడకూతురు.

'షాక్' తిన్నాడు చిన్నదొర.

"ఏరా రామయ్యా! నీ కూతురు పెద్దదయిందే!" అన్నాడు చిన్నదొర.

"ఈడేరి రెండు సంవత్సరాలయింది దొరా।" అని వినయంగా జవాబిచ్చాడు రామయ్య.

అక్కడ చేరిన జనం అంతా విరగబడి నవ్వారు.

దొర మందహాసం చేశాడు.

"ఇంతకూ ఏం జరిగింది? నీ కథ చెప్పు" అన్నాడు దొర ఆ అమ్మాయిని ఉద్దేశించి.

ఆ అమ్మాయి మౌనంగా తల వంచుకొని ఉంది.

"ఈ పిల్ల మనువాడిందట్రా?" అని ప్రశ్నించాడు మాలీ పటేల్.

"ఇంకా లేదు బాబయ్యా. నా అయిన వోళ్ళలో పిల్లాడికి ఇవ్వాలని నా కోరిక. తనవైపు వాళ్ళలో పిల్లాడికి ఇద్దామని మా ఇంటిది అంటుంది. దాంతో ఎటూ తేలక...

..." నీళ్ళు నమిలాడు రామయ్య.

"పిల్ల ఏపుగా పెరిగింది. త్వరగా పెళ్ళి చెయ్యరా" అన్నాడు పెద్దకాపు.

పక పకలూ. ఎకచెకలు పలికింది జనం.

"ఇంతకూ నీవు చెప్ప తలచుకుంది త్వరగా చెప్పు" విసుగ్గా పలికాడు దొర.

మంగమ్మకు తల కొట్టేసినట్లయింది. కళ్ళ నీళ్ళ పర్యంతమయింది. ఆనాడు విరాటరాజు సభలో కీచకుడిచేత అవమానింపబడిన ద్రౌపదిలాగా ఆమె గజగజలాడిపోతుంది. ఆమె ఊగిపోతున్నది. తెలియని వాళ్ళు ఆమె భయపడు తున్నదనుకున్నారు. కాస్త ప్రపంచ జ్ఞానం తెలిసిన వాళ్ళకు ఆమె మనస్సు కోపంతో తుక తుక కాగిపోతున్నదని తెలిసింది.

ఆమె పలికింది. "రైతుల చేలగట్ల మీద మాబోటివాళ్ళు గడ్డి కోసుకోవటం మామూలే. వద్దని అప్పుడప్పుడు వాళ్ళు మమ్మల్ని అదలించటం కూడా మామూలే. మేము వారిని బతిమాలటం, 'ఈసారికి సరేలే' అన్నట్లుగా వారు మాట్లాడటం ఎప్పుడూ జరిగేదే. కాని ఈసారి అలా జరగలేదు. ఆయన వచ్చి నా పైటకొంగు పట్టుకున్నాడు. నా భుజంమీద చెయ్యి వేశాడు నన్ను ఆశగా చూస్తున్నాడు. నాకు భయమేసింది. దోకుడు పారతో ఆయనను నెట్టి పరుగెత్తి ఇంటికి పోయాను. నేనేం తప్పు చెయ్యలేదు."

ఈ మాటలు విన్న వ్యవసాయ కూలీల ముఖాలు ఎర్రబడ్డాయి. పాలేర్లు తలలు దించేసుకున్నారు. రైతులు 'ఆడదానికి ఇంత పొగరా' అన్నట్లుగా చూస్తున్నారు. పళ్ళు పట పట కొరుకుతున్నారు.

"ఊళ్లో పెద్దలు లేరనుకున్నావా? నువ్వే చెయ్యిచేసుకుంటావా రైతుమీద?" అన్నాడు పెదకాపు.

"వయసులో ఉన్న పిల్ల" అని వ్యంగ్యంగా మాటలు పసరాడు దొర.

రైతు యువకులు ఆమోదం తెలుపుతూ ఈలలు వేశారు. మంగమ్మ పరిస్థితి దారుణంగా ఉంది. ఆమె అనుభవించే మానసిక హింస వర్ణనాతీతం. భూమి బ్రద్దలయి తనలో ఇముడ్చుకుంటే బాగుండునని ఆమె తలపోస్తున్నది. ఈ తరుణంలో ఒక స్త్రీ కంఠం వినిపించింది.

"ఏమిటీ అన్యాయం? ఒక్క ఆడకూతురును వంద మంది మగాళ్ళ ఎదుట నిలబెట్టి నానా మాటలూ అంటారా? ఆపండి ఈ పంచాయితీ." ఆ గొంతులో దార్ఢ్యత ఉంది. పట్టుదల స్ఫురిస్తున్నది. ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతున్నది. జనం విస్తుపోయారు. అరుగుమీద పెద్దలు ముఖాలలో నెత్తురు చుక్కలేదు. వెల వెలపోతున్నారు. అందరికన్న ముందుగా తేరుకున్నది దొర.

"రంగీ! ఏమిటీ గోల? ఏమిటా కేకలు అరుపులు."

"నేను రంగమ్మను. నన్ను అలా పిలవడం మర్యాద" అంది ఆమె ధీమాగా.

కలవరపడ్డాడు దొర. అతని నోట మాటరాలేదు.

"రంగమ్మా తొందర పడుతున్నావు" అన్నాడు పెద కాపు.

"మీకు అక్కచెల్లెళ్ళు లేరా? మీరు ఒకమ్మ కన్న పిల్ల లేకదా! చిన్నపిల్లను పదిమందిలో అల్లరి పెడ్తారా. మీకు సిగ్గూ శరమూ లేవు!" ముదుసలి ముత్తమ్మ వణుకుతూ మాట్లాడింది. దొర ఉగ్రుడవుతున్నాడు. తను కలుగ జేసుకోకపోతే ప్రమాదమని భావించాడు మాజీ మాలీపటేల్.

"ముత్తమ్మా! నీవు ఎవరి ఎదుట మాట్లాడుతున్నావో తెలుసా? దొరగారి ఎదుట. గ్రామ పెద్దలైన మా ఎదుట. తరతరాలనుండి గ్రామ సౌభాగ్యాన్ని అంగరక్షకుల్లా కాపాడుతూ వస్తున్న వంశాలలో పుట్టిన మాబోటి వాళ్ళ ఎదుట. పెద్దదానివి కనుక బ్రతికిపోయావు. పో ఇక్కడ నుండి. పంచాయితీలలోకి ఆడవాళ్లు రాకూడదు." మాజీ మాలీపటేల్ అనునయంగా, కాస్త బెదరింపుగా లౌక్యంగా మాట్లాడాడు. ముత్తమ్మ అవాక్కయిపోయింది.

రంగమ్మ అందుకుంది.

"మా ఆడవాళ్ళ చాకిరీ కావాలి. మేము సంపాదించే కూలి డబ్బులు, మేము ఆదాచేసే పైకమూ మగవాళ్ళకు కావాలి చివరకు మా వోట్లు కావాలి. మా పేరుతో అధికారాలు కావాలి. అన్ని సౌకర్యాలు, సదుపాయలు హక్కులు మీకు కావాలి. కాని మేము సభలకు రాకూడదు. సమాజ వ్యవహారాలల్లో వేలు పెట్టకూడదు. చివరకు మా తోటి స్త్రీని అవమానపరుస్తుంటే మేము ఇది అన్యాయమని అనరాదు. ఆహా! ఏమి న్యాయం! ఏమి ధర్మం! పాలించండి మహా ప్రభువులు! ఎన్నాళ్లు సాగుతుందో చూస్తాం ఈ అక్రమం! ఇక సహించం ఈ దౌర్జన్యం."

రంగమ్మలో భీకర కాళికావతారం కన్పిస్తున్నది. ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి. పెదవులు వణుకుతున్నాయి. నాశికా పుటాలు ఎగిరి పడుతున్నాయి. ఆమెను చూచి అక్కడచేరిన పురుషులు చాలామంది భీతావహులయినారు.

చివరకు పెదకాపు ధైర్యం చేశాడు.

"రంగమ్మా మీ ఆయన ఇక్కడే ఉన్నాడు. అతని ఎదుటనేనా నీవు ఇలా మాట్లాడేది?" అని ఆమెను హెచ్చరించాడు.

రంగమ్మ భావోద్రేకం చల్లారలేదు, ఆమెలో అన్యాయాన్ని ప్రతిఘటించే మనస్తత్వం సమసిపోలేదు. ఆడకూలీల మేస్త్రీగా ఆమెలోని నాయకత్వ లక్షణాలు ఆమెకు అండగా నిల్చాయి. ఆమె గంభీరస్వరంతో, ఆత్మవిశ్వాస ధోరణిలో ఇలా ప్రసంగించింది.

"పెదకాపుగారూ! నా మొగుడు ఈ సభలో మీతో పాటు ఉన్నాడని గుర్తుచేశారు. అందుకు మీకు నా దండాలు. కాని నా మామ సంగతి నాకు తెలుసు.అతడు అన్యాయాన్ని చేయడు. ఎప్పుడూ అక్రమాన్ని సమర్ధించడు. కాకపోతే మీబోటి పెద్దల ముందు గట్టిగా మాట్లాడడు నేను ఆడకూలీల మేస్త్రీగా వాళ్ళ హక్కుల కోసం ఆందోళన చేసినా, పోరాడినా నన్ను ఏమీ అనడు. నా మామ పేరు చెప్పి నన్ను మీరు బెదిరించాలనుకోవటం పొరపాటు. మీరు చేస్తున్న అన్యాయాన్ని గ్రహించండి. మంగమ్మ తరఫున మాట్లాడటానికి ఒక్క మహిళను కూడా పంచాయితీలోకి రానీయని మీరు, పెద్దలలో ఒకరుగా కూర్చోనీయని మీరు న్యాయం చేయలేరు. అది మీ మనస్సులకు తెలుసు. తెలిసే ఈ దుర్మా

ర్గానికి పూనుకున్నారు. స్త్రీ జాతి మిమ్మల్ని సహించదు. చరిత్ర మిమ్మల్ని క్షమించదు."

రంగమ్మ ఆవేశంతో ఊగిపోతున్నది. ఆమె మాట్లాడుతున్న సమయంలో రెండువందల మంది స్త్రీలు పంచాయితే జరిగే చోటుకు చేరుకున్నారు. ఆమె ప్రసంగం అయిన తరువాత వారంతా ఇలా నినాదాలిచ్చారు.

"స్త్రీలపై దౌర్జన్యాలు నశించాలి"

'మహిళల ఎడ అన్యాయం నశించాలి'

'మహిళా ఐక్యత వర్ధిల్లాలి.'

ఈ నినాదాల హోరుకు సభాస్థలి దద్దరిల్లింది పెద్దలు ముఖ ముఖాలు చూచుకున్నారు గ్రామంలో కాస్తో కూస్తో చదువుకున్న యువకులు చప్పట్లుకొట్టి ఆ మహిళల డిమాండ్ల పట్ల తమ సానుభూతిని వెలిబుచ్చారు.

పరిస్థితి విషమిస్తున్నదని పెద్దలు గ్రహించారు. దొరకు తత్తర ఎక్కువయింది. అయినా గుండె చిక్కబట్టిన ఇలా అడిగాడు, "మీరు అసలు భారత స్త్రీలేనా? మీ అమ్మలు అమ్మమ్మలు, నాయనమ్మలు ఇలా ఐరి తెగించి సభలకు వచ్చి పురుషులను ఎదిరించారా? సమాజాన్ని ధిక్కరించారా? ఇంతకూ మీరు కోరేదేమిటో మీకు తెలుసా? తెలిస్తే తెలియ జెప్పండి. తెలుసుకుంటాము.

ఈసారి మాట్లాడటం ఎం. ఎల్. ఏ అభ్యర్థిగా పోటీ చేసిన అ ంధతిది అయింది. ఆమె ముందుకు వచ్చింది.

'అరుంధతికి జై' అని ముక్తకంఠంతో మహిళలు గొంతెత్తి అరిచారు.

అరుంధతి తన కుడిచేత్తో నిశ్శబ్దంగా ఉండమని సంజ్ఞ చేసింది. సభలో నిశ్శబ్దత ఆవరించింది. అది ప్రళయానికి మున్ముందు ఉండే ప్రశాంతత.

"ఇక్కడ చేరిన నా తోటి స్త్రీలకు, సోదరులకు మున్ముందుగా నాకు ఈ అవకాశం ఇచ్చిన వారికి ధన్య వాదాలు. "స్త్రీలు కోరేదేమిటో చెప్పమన్నారు. సంతోషము. ఇంత కాలానికయినా తెలుసుకోవాలనే కోరిక పెద్దలకు కలిగి నందుకు ఆనందిస్తున్నాను.

మేము కోరేది సమానత్వం—అంటే స్త్రీ పురుష సమా త్వం. మాకు వోట్లు వచ్చాయి. అంటే రాజకీయ సమా నత్వాన్ని మీరంతా ఒప్పుకున్నట్లే. కాకపోతే ఆచరణ సంగతి వేరు. కనీసం మాటల్లోనయినా కాదనటంలేదు. అంతవరకు మంచిదే. కాని మాకు అది చాలదు. రాజకీయ సమానత్వం ఆచరణలోకి అనుభవంలోకి రావాలి.

ప్రస్తుత విషయానికి వద్దాం. మాకు సామాజిక సమా నత్వం లేదు. సమాజ వ్యవహారాల్లో మమ్మల్ని చోరనీయటం లేదు. మా జీవితాలను శాసించే వివాహం, సంతానం, లైంగిక జీవితంలాంటి విషయాలలో మేము లెక్కలోకి రావటంలేదు. నిర్ణయాధికారం మా తండ్రులది, భర్తలది, అన్నా తమ్ము లది. మేము ఇతరుల సొత్తులం. పెండ్లికానంత కాలం ఆ కన్యను ఎవరైనా తమ స్వంతం చేసుకోవాలని ప్రయత్నించ

వచ్చు. ఎదిరిస్తే, నిరోధిస్తే, ప్రతిఘటిస్తే, పోరాడితే స్త్రీ లక్షణాలకు వ్యతిరేకం. ఎవరు చెప్పారు ఈ న్యాయాన్ని. పురుషులకో నీతి, స్త్రీలకో నీతి. ఈ ద్వంద్వనీతిని ఇక మేము ఆమోదించం. తన శీల రక్షణకు, తన ప్రాణ రక్షణకు ఏ స్త్రీయైనా తగుచర్య తీసుకుంటే సమర్థనీయమే."

సభలో గుసగుసలు బయలుదేరాయి. ఆమె తన ఉపన్యాసాన్ని కొనసాగించింది. "మంగమ్మ కేసు తీసుకోండి. ఇంత దురన్యాయం మరొకటి స్త్రీజాతి పట్ల జరగదు. ఈ పంచాయితీ సభలకు స్త్రీలను రానివ్వకపోవటం మొదటి తప్పు. స్త్రీలను మాట్లాడకుండా చేయాలని ప్రయత్నించడం రెండవ తప్పు. పంచాయితీ పెద్దలలో అసలు స్త్రీలు లేకుండా చేయటం మూడవ తప్పు. నేరారోపణ చేసిన వ్యక్తిని, నిందితురాలిని తమ తరఫున చెరి ముగ్గురు పెద్ద మనుష్యులను—విచారించి తీర్పు చెప్పటానికి - నియమించుకోటానికి అవకాశం ఇవ్వకపోవటం నాలుగవ తప్పిదం. ఇంత మందిలో ఒక్క ఆడకూతురును ముద్దాయిగా నిలబెట్టి, హాస్యంపేరుతో అపహాస్యం చేస్తూ, ఎగతాళి చేస్తూ ఆమెను అవమానించటం ఐదవ పొరపాటు. స్త్రీజాతి యెడ అమర్యాదను, అసహనాన్ని, ఏహ్యభావాన్ని ప్రదర్శించటం చివరి తప్పు.

ఒక్కమాట చెప్పి ముగిస్తాను. మేము పురుషులను ద్వేషించం. వారు మాకు కావలసిన వారు. తండ్రులు, అన్నదమ్ములు, భర్తలు, కుమారులు. కాని పురుషాధిక్యతను సహించం. పురుష దురహంకారాన్ని భరించం.

మరచిపోతారేమో మీరు. మా డిమాండ్లు ఈ కేసులో ఏమిటో తెలుసా ? కేసు పంచాయితీ వ్యవహారంలో అన్ని స్థాయిలలో అన్ని దశలలో మహిళాలోకానికి జోక్యం, ప్రమేయం, ప్రవేశం ఉండాలి. మాలో కొంతమంది పెద్దలుగా పంచాయితీ తీర్పుకు కూర్చోవాలి. ఇప్పటికి మీకు అర్ధమయి ఉంటుంది మేము కోరేది ఏమిటో । అంగీకరించండి! అంగీకరించకపోండి. కాని మా కోరిక ఏమిటో తెలియలేదని అనకండి.''

మహిళలు నినాదాలు చేశారు.

''సామాజిక సమానత్వం కావాలి''

''స్త్రీ పురుషులు సమానులే''

''సామాజిక న్యాయం కావాలి''

''స్త్రీలు గ్రామ పెద్దలుగా అర్హులే''

''మహిళా ఐక్యత వర్ధిల్లాలి''

నినాదాల హోరుకు సభ చలించింది. యువకులు హర్షామోదాలు తెలిపారు. ముసలివాళ్ళు ముక్కుమీద వేలేసుకున్నారు. నడివయస్కులు అవాక్కయినారు. దొర సభ నలుమూలలకు దృష్టి సారించాడు. తనకు అనుకూలంగా సభలో లేచి మాట్లాడిన మనిషి లేడు. తన నౌకరు మాత్రం తనవైపు చూస్తున్నాడు తన ఉత్తరువుల కోసం. అరుగుమీద ఉన్న పెద్దల మొగాలలో కళాకాంతులు లేవు. పరిస్థితి చేయి దాటిపోయిందని తోచింది దొరకు వెంటనే లేచి 'వీరయ్య

కేసు తరువాత విచారిద్దాం వాతావరణం బాగాలేదు. మరో సారి కలుద్దాం. పంచాయితీని వాయిదావేశాం" అన్నాడు.

ఈసారి స్త్రీలు ఒకే ఒక్క నినాదం ఇస్తూ బస్తీవైపు వెళ్ళారు.

"మహిళా ఐక్యత వర్ధిల్లాలి." అనేదే ఆ నినాదం.

* * *

రామాపురంలో కాలక్రమేణ మార్పులు వచ్చాయి. కొండవాగుకు ఆనకట్ట కట్టి చెరువులో నీరు నిల్వచేశారు. ఆ నీటితో చెరువు క్రింద ఒక వెయ్యి హెక్టారుల భూమి మాగాణి సాగులోకి వచ్చింది. వరి వేయడం ఆరంభమయింది. బలహీన వర్గాల సంస్థవారు, దళితజాతుల ఆర్థిక సహాయ సంస్థలవారు, గిరిజన కార్పొరేషనువారు కాస్తో కూస్తో ప్రజలకు సహాయం చేయటం మొదలుపెట్టారు. అలాగే రామాపురం పాతబస్తీలో ముప్పది ఇళ్లు, కొత్త బస్తీలో ఇరువది ఇళ్ళు, వెనుకబడిన జాతులవారికి 50 ఇళ్ళు కట్టించి కొద్ది వాయిదాలమీద చెల్లించే పద్ధతిలో బీద ప్రజలకు ఇచ్చింది ప్రభుత్వం. నాలుగవ తరగతి వరకు ఉన్న పాఠశాల పెరిగి 7వ తరగతి దాకా వచ్చింది.ఆయుర్వేద వైద్యశాల వచ్చింది. ఇన్ని మార్పులు వచ్చినా ఒక విషయంగా ఏమీ మార్పులేదు. అదేమంటే స్త్రీలహోదా, పురుషుల హోదాలలో వ్యత్యాసం.

అలాగే ఆడవారు చేసే పనికి తక్కువ వరుమానం, మగవారు చేసే పనికి ఎక్కువ వచ్చే విధానంలో మార్పులేదు. ఇంటి పని, వంటపని స్త్రీకి కేటాయించడంలో పూర్వపు స్థితికి ఈనాటి పరిస్థికి తేడాలేదు. ఇలా ఎన్నయినా ఏకరువు పెట్ట వచ్చును. అన్నింటికీ మూలసూత్రం 'పురుషుడు అధికుడు, స్త్రీ అల్పురాలు' అనేదే.

ఒకనాడు కొత్తబస్తీలో చర్చిముందు పందిట్లో వ్యవసాయ కూలీలుగా ఉండే స్త్రీ పురుషులు సమావేశమయినారు. పాతబస్తీ నుండి రంగమ్మ, అరుంధతి, లచ్చమ్మ, వెంకన్న' రామయ్య వచ్చారు. కొత్తబస్తీ నుండి యోహాను, మత్తయి, మరియమ్మ, కృపాబాయి వచ్చారు. గ్రామంలో నుండి సన్నకారు రైతుల ప్రతినిధిగా పుల్లయ్య పాల్గొంటున్నాడు. వారందరు గంభీరంగా ఉన్నారు. ఏదో తీవ్రమయిన విషయం వారి మనస్సులను కలచివేస్తున్నది. అందరి ముఖాలలో ఒక విధమైన ఆదుర్దా కనిపిస్తున్నది. దానికి కారణం పదిరోజులుగా సాగుతున్న ఆడకూలీల సమ్మె విషయంలో స్థబ్దత రావడము తప్ప మరేమీ కాదు. రంగమ్మ నాయకత్వాన ఆడ కూలీలు కూలిరేట్లు పెరగందే కోతలకు రామని, చేలల్లో దిగమని పని మానివేశారు. ఇక మూడు నాలుగు రోజుల్లో పైరు కోయకపోతే పంట నేలపాలవుతున్నది. పరాయి గ్రామాల నుండి కూలీలను తేవాలని ఆసాములు, భూస్వాములు ఆలోచిస్తున్నారని, ఇతర గ్రామాల గూడెంలకు

కబుర్లు పెడ్తున్నారని పుకార్లు ముమ్మరంగా వినిపిస్తున్నాయి. రౌడీలను, పోలీసులను రంగంలోకి దింపుతారనీ మాటలు కర్ణాకర్ణిగా వినబడుతున్నాయి. దాంతో రంగమ్మ, అరుంధతి తదితర మేస్త్రీలు, నాయకులు ఆలోచించి మగవాళ్ళ సాయం కోరదామని నిశ్చయించుకున్నారు. అందుకే ఈనాటి సమావేశాన్ని ఏర్పాటుచేశారు. ఆ విషయమై అందరికీ ఆందోళనగా ఉంది కనుక ఆహ్వానితులు అంతా వచ్చారు.

అరుంధతి లేచి నిలబడి గొంతు సవరించుకొని ఇలా మాట్లాడింది. "అన్నయ్యలూ ! అక్కయ్యలూ! మన సమ్మె కొలిక్కి వస్తున్నది. ఇపుడు చాలా చిక్కు సమయం. భూస్వాములు దుర్మార్గాలకు దిగుతారని కబుర్లు వస్తున్నాయి. ఇప్పుడు మనం పట్టు వదిలితే చేసిన కృషి అంతా బూడిద పాలవుతుంది. ఇంతవరకూ మగవాళ్లు సమ్మెను బలపరచక పోయినా ఆడవారిని నిరుత్సాహపరచలేదు, అడ్డు పెట్టలేదు. ఇక స్త్రీ పురుషుల సమిష్టి పోరాటం జరిగితే కాని ఫలితం రాదు. అందుకే అన్నలందరికీ శ్రమ ఇచ్చాం. మీరు ఏమి సలహా ఇస్తారో చెప్పండి. నిర్మొగమాటంగా మాట్లాడుకుందాము. మనలో మనకు అభిప్రాయ భేదాలు ఉంటే ఆసాముల వద్ద చులకన అయిపోతాము. పాతబస్తీ పెద్ద వెంకన్న గారు ముందు మాట్లాడితే బాగుంటుంది."

వెంకన్న లేచి నుంచున్నాడు. పెద్దలు కూర్చొని మాట్లాడండి అన్నారు ఎవరో. దాంతో అతగాడు కూర్చొని

ప్రసంగించ సాగాడు. "మీకు ఇన్నాళ్ళు రోజు కూలీ ఆయిదు రూపాయలిస్తున్నారు. మాకు తొమ్మిది పది రూపాయలిస్తున్నారు. మాతో సమానంగా కూలిరేటు ఇప్పించమని మీరు సమ్మె చేస్తున్నారు. ఏదో మనవాళ్ళు పోరాడుతున్నారు కదా అని మేము ఉలక్కుండా పలక్కుండా ఊరుకున్నాము. మీ ఆడంగులచేత సమ్మె ఆపించమని అసాములు కబురు పెట్టినా మేము పట్టించుకోలేదు. మీకు ఎక్కువ కూలిపస్తే మనందరి కుటుంబాలకు లాభమే. అయినా ఎందుకో మాలో కొందరికి మీ కోరిక న్యాయంగా కనపడటంలేదు. మగాడు చేసిన కష్టం ఆడవాళ్ళు చేయలేరు. మేము పారదమ్ము చేస్తాం, నాగలితో దున్నుతాము, పలుగుతో నేల పల్లం చేస్తాం. ఇవన్ని మీరు చెయ్యలేరు, చెయ్యటం లేదు. మరి మాతో సమానంగా మీరు కూలీ రేటు కోరడం మాకు నచ్చడంలేదు. అడిగారు కనుక చెప్పాను. తరువాత మీ ఇష్టం."

రంగమ్మ లేచింది మాట్లాడదామని. 'కొత్తబస్తీ పెద్ద మత్తయిగారు మాట్లాడిన తరువాత నీవు మాట్లాడుదువుగాని రంగమ్మా!' అని అరుంధతి ఆమెను వారించింది. మత్తయి మెల్లగా మాటలు పలకడం మొదలుపెట్టాడు. మత్తయి కొంచెం వయస్సులో పెద్దవాడు అందరూ అతనిని తాతయ్యా అని పిలుస్తారు. "అమ్మాయిలూ! మీరు పట్టు పట్టారు. నెగ్గు కొచ్చారు ఇంతవరకు, సంతోషము. ఇక ముందున్నది మునళ్ళపండుగ. ప్రక్క గ్రామాల కూలీలు వస్తారు. మీరు

అటకాయిస్తారు. ఆసాములు రౌడీలను తెస్తారు. వాళ్ళు మీ మీద చెయ్యి చేసుకుంటారు. మేము చూస్తూ ఊరుకోలేము కదా! మేము వచ్చి వారితో కలబడతాము. రయిడింగు జరుగుతుంది. ఎవరు చస్తారో, ఎవరు బ్రతుకుతారో ఎవరికి ఎరుక. కనుక తెగిన దాకా లాగక ఏదో బెట్టుగా ఉండి రాజీపడండి. తర్వాత మీరు ఆలోచించుకోండి" అని ముగించాడు.

"రంగమ్మ ఆవేశంతో లేచి నిల్చున్నది ఆమెనోట మాటలు కొండవాగు నీటి వేగంతో వస్తున్నాయి "వెంకన్న మామ చెప్పింది విన్నాము. మత్తయి తాతయ్య ఇచ్చిన సలహా ఆలకించాము. వారు మన బస్తీల పెద్దలు, కష్ట సుఖాలు తెలిసినవారు. మనకు అండదండలు అందించే వారు. మామూలుగా వారి మాటను మనం కాదనం. అయితే వాళ్ళు నిక్కచ్చిగా తమ అభిప్రాయాలు తెలిపారు గనుక, ఏమి చేసినా మనందరం కలసి చెయ్యాల్సిన తరుణం వచ్చింది గనుక నేనూ అలాగే మాట్లాడుతాను. ఏమీ అనుకోవద్దని మామను, తాతయ్యను కోరుతున్నాను. వెంకన్న మామ చెప్పిన దాంట్లో ఒకటి రెండు అంశాలను నేను వివరిస్తాను. పురుషులందరూ స్త్రీలందరి కంటే బలవంతులంటే మేము అంగీకరించం. పురుషులలో చాలామంది బలహీనులున్నారు. స్త్రీలలో అనేకమంది సబలులు ఉన్నారు. కాకపోతే సర్వ సామాన్యంగా పురుషులు కొంత బరువు పనులు చేస్తున్నారు. అలా తర తరాలనుండి చేస్తున్నారు అలా కష్టపడు

తున్నారు కనుక వారి బలం పెరుగుతున్నది. దీనిని బట్టి పురుషులకు కూలీరేటు వేరు, స్త్రీలకు వేరు అనడం న్యాయం కాదు. అయినా కాలం మారుతున్నది. చిన్న కమతాలలో పనిచేసే యంత్రాలు కూడా వస్తున్నాయి. ట్రాక్టర్లు ఎప్పుడో వచ్చాయి. బరువు పనులు చేయాల్సిన అవసరం అందరికీ తగ్గిపోతున్నది. అదీగాక కండబలం కన్న బుద్ధిబలానికి ఆధిక్యత వస్తున్నది ఈ కాలంలో.

మరో మాట చెప్తాను. స్త్రీలు పారదమ్మ్మ చేయలేరు అన్నాడు వెంకన్న మామ. నిజమే। మేము చేయటం లేదు అయితే వంచిన నడుము పది నిముషాల వరకు ఎత్తకుండా మేము ఆడవాళ్ళం నాట్లు వేస్తాం, పైరు కోస్తాం. మరి! మీరు మగవాళ్లు ఆ పని చెయ్యండి చూద్దాము. మీరు చెయ్యలేరు. పది రూపాయల కూలి ఇచ్చినా చెయ్యరు. ఎందుకంటే మీ దృష్టిలో అది ఆడపని, ఆడవాళ్లు చేసేపని. కనుక తక్కువ విలువగల పని. నిజానికి ఎవరి పనిలో గొప్పతనం వారిది. గొప్పతనాన్ని గుర్తించాలి కాని పని స్వభావంలో తేడాను గురించి పట్టించుకో కూడదు. ఒక ఉదాహరణ చెప్తాను. పెళ్ళిళ్ళలో ఒకాయన అయిదు వందల మందికి వంట చేస్తాడు ఆయనకు రోజుకు రెండు వందలు ఇస్తారు. సహాయం చేసిన వాడికి వంద రూపాయలు, తీపి పిండివంటలు చేసేవానికి పెద్ద పెద్ద హోటళ్ళలో రెండు మూడువేల రూపాయలిస్తారు.

ఇంతకూ ఆడవాళ్లు చెప్పేదేమంటే మగవాళ్ళు చేసినా, ఆ పనిలో ప్రత్యేకత, నైపుణ్యం ఉన్నాయా లేదా అని ఆలోచించమంటాను.

ఇక పని గంటలంటారా మేము మీతోపాటే పొలం వచ్చి మీతోపాటే ఇంటికి వస్తున్నాం. గట్టిగా లెక్క కడ్తే స్త్రీలే ఎక్కువ గంటలు పని చేస్తున్నారు పొలాల్లో.

నేను ఇక్కడ కూడిన అన్నతమ్ముళ్ళనూ, మామయ్యలను, తాతయ్యలను బతిమాలుతున్నాను ఇలాంటి వాదనలు చెయ్యవద్దని. నిజానికి ఈ వాదనలు మనవి కావు. భూస్వాములకు, ఆసాములకు లాభించేది. ఆసాములు అనాల్సిన మాటలు మనవాళ్లు అనటం మంచిది కాదు. మీరంతా పెద్దలు. నా మాటల బాగోగులు బాగా ఆలోచించండి." మేస్త్రీ రంగమ్మ ఇంత సుదీర్ఘంగా, హేతుబద్ధకంగా మాట్లాడగలదని అక్కడ చేరిన పురుషులకు అంతకు ముందు తెలియదు వారు విస్తుపోయారు, ఆ మాటకు వస్తే సంతోషించారు కూడాను.

మరియమ్మ పుట్టిల్లు ప్రక్కగ్రామం. కష్టాపురం అక్కడ హైస్కూలు ఉంది. ఆమె 9 క్లాసులు చదివింది. వయస్సులో చిన్నదయినా చురుకైన పిల్ల 'నేను మాట్లాడనా?' అని ఆమె అరుంధతిని అడిగింది. 'తప్పకుండాను' అని అరుంధతి సమాధానం చెప్పింది. మరియమ్మ గొంతు కంచులా ఖంగుమని మ్రోగింది. "వృత్తయి తాతయ్య అనుభ

వంతో రాబోయ్యే ఇబ్బందులను గురించి ముందుగా మనలను హెచ్చరించాడు. ఆయనకు నా కృతజ్ఞతలు. మనలో ఐక్యత లేకపోతే ఆయన చెప్పినవన్నీ జరుగుతాయి. ముందు కావలసింది మనం స్త్రీ పురుషులం ఒకరి నొకరం అర్థం చేసుకోవటం. మన కోర్కెలు మంచివని మనందరం అనుకోవటం. తరువాత చుట్టుప్రక్కల పల్లెలకు గూడెములకు వెళ్ళి అచటి కూలీలకు మన ఊరికి పనికి రావద్దని నచ్చచెప్పడం. గూండాలు, రౌడీలను ఆసాములు రంగంలోకి దింపటం ఎవరికీ మంచిది కాదని వారికి ముందుగా కబురు పెట్టడం. ఇలా ఇన్ని పనులు చేస్తే ఆసాములు దిగి వస్తారు. మనకు న్యాయం చేస్తారు."

ఆ అమ్మాయి ప్రసంగానికి ముగ్ధుడయినాడు పుల్లయ్య "పల్లెలు, గూడెములు, బస్తీలు మాత్రమే కాదు, ఊళ్ళోమేము లేమా? ఎందుకు భయపడతారు?" అని ధైర్యం చెప్పాడు. వెంకన్న భార్య లచ్చమ్మ ఊరుకుండ లేకపోయింది. "మీరంతా మా పక్షాన ఉంటే రేపు ఈపాటికి ఆసాములు రాజీకి వస్తారు మత్తయి తాతయ్యా!" అని అన్నది వెంకన్న లేచి గొంతు పెద్దదిచేసి ఇలా అన్నాడు, "మా తాతదండ్రుల నాటి మాటలు నేను చెప్పాను. కాలం మారింది. మారుతున్నది. ప్రభుత్వ సంస్థల్లో, గవర్నమెంటు ఆఫీసుల్లో ఒకోపనికి ఒకో జీతం అని వచ్చింది గదా! స్త్రీలకయినా, పురుషులకయినా జీతంలో తేడాలేదు. పైగా స్త్రీలకు ఎక్కువ సదుయాలిస్తున్నారు. మీరు కోరుతున్నది బహు స్వల్పం. మాతో

పాటు సమానంగా ఇమ్మన్నారు. ఇంతేగా! అందరం కలసి మీ కోరికలనే బలపరుద్దాం." అన్నాడు సంతోషాతిశయంతో. మహిళలు, యోహాను, రామయ్యలు ఒక్కుమ్మడిగా చప్పట్లు కొట్టారు.మరియమ్మ ఉద్రేకంతో నినాదాలిచ్చింది.

"ఆడవాళ్ళకు కూలీరేట్లు పెంచాలి !"

"స్త్రీ పురుషులకు సమాన వేతనంకావాలి!"

"ఆర్థిక సమానత్వం కావాలి."

"శ్రామిక ఐక్యత వర్ధిల్లాలి"

తతిమ్మా స్త్రీ పురుషులు వంత పలికారు.

ఈ వార్త ఆసాములకు చేరింది గంటలో. ఆ సాయంత్రం ఆసాములు, కూలీలు రాజీపడి ఒప్పందానికి వచ్చారు. గ్రామంలో భయాందోళనలు తగ్గాయి. స్నేహ పూర్వక వాతావరణం గ్రామంలో నెలకొన్నది. మహిళా ఐక్యతతో, స్థిర చిత్తంతో, వాదనా సామర్థ్యంతో, దృఢ సంకల్పంతో పోరాట పటిమతో రామాపురంలో ఆర్థిక సమా నత్వం సాధించుకున్నారు. స్త్రీ పురుషుల మధ్య కూలీరేట్లలో తేడాలు తీసివేయించగల్గారు. అది వారి ఘన విజయం.

* * *

## సాంస్కృతిక సమానత్వం

నాట్లకూలి పోరాటంజరిగి 12 సంవత్సరాలుదాటింది. అంతకు క్రితం కేవలం మగవాళ్ళతో మాత్రమే ఏర్పడే

పంచాయతీ విధానం ఎప్పుడో రద్దయింది. రామాపురం ఆధునిక నగర లక్షణాలను సంతరించుకుంది. జూనియరు కాలేజి పుట్టింది. ఇంగ్లీషు మందుల ఆస్పత్రిని పెట్టారు. పశువుల ఆస్పత్రికి తగిన వసతి ఏర్పడింది. ఒకటి రెండు వడ్లమిల్లులు వెలిశాయి. సరే! వీటి విషయం చెప్పనక్కరలేదు. కాఫీ హోటళ్లు, భోజన హోటళ్ళు కిరాణా దుకాణాలు, మందుల షాపులు ఇలా బజారు పెరిగింది. రామాపురం చుట్టుపక్కల పది గ్రామాలకు బాగా వ్యాపార కూడలి అయింది. కొండ దిగువ వాళంతా సరకులకు ఇక్కడికే వస్తున్నారు. అసలు విషయం మరచిపోలేదు సుమండీ! 'ప్రసాదు'గారు గ్రామంలో రెండు మూడు ప్రదేశాలలో దర్శనం ఇస్తున్నారు. ప్రభుత్వ సారాదుకాణాలలో అమ్మకం నిండుగానే సాగుతున్నది. ఇప్పుడు ప్రతిరోజూ సారాయి త్రాగేవారి సంఖ్య బాగా పెరిగింది. ఆడవాళ్ళు కూడా ఈ విషయంలో స్వేచ్ఛను పొందగలిగారు. వారినీ ప్రసాదుగారు ఆదరిస్తున్నారు. వారు బహిరంగంగా, కాఫీ హోటలులో కూర్చొని కాఫీ త్రాగినట్లు మొదట్లో సారాలను తరువాత ప్యాకెటు సారాను త్రాగటం అలవాటు చేసుకున్నారు. ఇక చదువుకున్నవారి సరదాలు వేరే వివరించనక్కర లేదేమో! విదేశీ మద్యపు దుకాణాలు ఉద్భవించాయి గ్రామం నడిబొడ్డున. స్కూటర్లు, మోపెడ్లు ఎక్కువగా కనిపిస్తున్నాయి రోడ్లమీద. ఇన్ని ఉండి అవి తక్కువయితే బాగుండదని ఏమో రెండు నర్సింగు హోమ్‌లు

నెలకొల్పారు ఒక ఆర్. ఎం. పి. డాక్టరు, మరో సర్జను. ఊరు కళ కళలాడుతున్నది విద్యుచ్ఛక్తి వచ్చింది కదా ! ఇంత జరిగినా ముసలోళ్ళ మనస్సులలో ఏదో కొరత ఉన్నట్లున్నది. నడి వయస్సు స్త్రీ పురుషులు ఇదంతా నడమంత్రపు సిరి అంటున్నారు. ప్రజల మనస్తత్వం చాలా మారింది. మునుపు హక్కుల కోసం పోరాడేవాళ్ళం, ఇపుడు ప్రాధేయపడుతున్నారు కుర్రకారు అనే మాటలు వినవస్తున్నాయి. 'మీలాగ మేం చేతులు ముడుచుకొని కూర్చోలేదు. దెబ్బకు దెబ్బ తీస్తున్నాం' అంటున్నారు ప్రభుత్వ బస్సులను చీటికి మాటికి తగులబెట్టే యువకిశోరాలు. ఊరు పెద్దదయింది కనుక రేపో మాపో అది మునిసిపాలిటీ కాక తప్పదని అందరూ అనుకుంటున్నారు. ఇంకా ఉద్యోగాలు దొరుకుతాయని నిరుద్యోగులు మురిసిపోతున్నారు. పన్నులభారం పెరుగుతుందని భయపడుతున్నారు పెద్దలు కట్టించిన పెద్ద ఇళ్ళు ఉన్నవాళ్ళు. పంచాయితీ అయితేనే లాభం, అభివృద్ధి పథకాలు ఎక్కువగా వస్తాయని, ప్రభుత్వ సహాయం ఎక్కువగా అందుతుందని నెత్తిన నోరు పెట్టుకొని వీధి వీధి వాడ వాడ చెప్తున్నారు నలుబది ఏండ్ల నుండి క్రమం తప్పకుండా పేపరు చదివే రాజకీయ కోవిదులు.

తమాషా ఏమంటే రామాపురంలో సందడిగా బాగా పెరిగింది. చుట్టుప్రక్కల వాళ్ళు ప్రతిరోజూ పదిమందైనా రామాపురం వస్తున్నారు. రామాపురం కాఫీ హోటళ్ళలో

కాఫీ సేవించి బజారు అరుగుల మీద కూర్చుని ఏవో కబుర్లు చెప్పుకునే వారి సంఖ్య పెరుగుతున్నది. వారివి పెద్దగొంతులు. అరుస్తూ మాట్లాడుతారు. కనుక వారి భావాలనే ప్రజాళి ప్రాయమని వ్రాస్తున్నారు పత్రికల వాళ్లు. దేశంలో ఉన్న ప్రతి రాజకీయ పార్టీ బోర్డు ఆ గ్రామంలో ఉన్నది. రామాపురంలో మన ఆఫీసు లేదంటే ఆ పార్టీవాళ్ళు ఆంధ్ర ప్రదేశ్‌లో లేనట్లే. పార్కును నెలకొల్పింది పంచాయితీ. జిల్లా గ్రంధాలయ శాఖను స్థాపించారు. దాని పఠనాలయంలో సినిమా పత్రికలలు చదివేవారు ఎకుకువయినారు. సినీ తారల అభిమాన సంఘాలు ఉత్పన్నమయినవి అసలు విషయం మరచిపోయాం రామాపురంలో గ్రామానికి నాలుగు వైపుల నాలుగు సినిమా హాలులు నడుస్తున్నాయి. సరే వేరే ప్రత్యేకంగా చెప్పవలసిన ఆవసరం లేదు, పేకాడగాళ్లు జులాయి మనుష్యులు, జూదగాళ్లు, రౌడీలు, గూండాలు పుట్టుకొచ్చారు పుట్టు కురుపులా. నడి వీధిన ఆడది నడచి వెళ్ళటానికి—పరువూ మర్యాద నిలుపుకో తలచుకున్న పడతి పయనించటానికి-చాలా సాహసం కావాలి. ఈలలు, ఎగతాళి మాటలు, ఎకచకలు పక పకలు, వెకలి చేష్టలు, నవ్వులు ఇవి సర్వ సాధారణ మవుతున్నాయి వయసు వచ్చిన వనిత వీధిలో అడుగు పెట్టటానికి సాహసించడం లేదు. అయితే ఇదే సమయంలో మరో పరిణామం సంభవిస్తున్నది. పేటకో మహిళా మండలి. బస్తీకో మహిళా సంఘం ఇలా ఎన్నో

సంఘాలు బోర్డులు కనిపిస్తున్నాయి. ప్రతి సంఘం చేసేపని ఒకటే. కుట్లు, అల్లికలు, భజనలు, పూజలు, మంత్రులకు దండలు వేయటం, ప్రభుత్వాధికార్లను సన్మానించటం ఇవే కార్యక్రమాలు.

ఈ అభివృద్ధిని చూచి వాపు అంటున్నారు కొందరు. కాదు ఇది ప్రగతికి చిహ్నం అంటున్నారు మరికొందరు. 'మనం సంధి కాలంలో వున్నాం. ముందున్నది మన స్వర్ణ యుగం' అని గేయాలు పాడుతున్నారు ఇంకా కొందరు. ఏదయినా చాలామందికి పరిస్థితి అంతు పట్టడంలేదు. 'ఎటు పోతున్నాం మనం? దేశం ఎటు నడుస్తున్నది?' అనే ప్రశ్న లకు సమాధానం దొరకక అవస్థ పడే వాళ్లు కూడా రామా పురంలో లేకపోలేదు.

సత్తెమ్మకు ఒక కొడుకూ కూతురూ ఉన్నారు. భర్త పది ఎకరాల మాగాణి పొలం ఉన్న రైతు. సాధారణంగా ఎవరి విషయాలలో తల దూర్చాడు. సత్తెమ్మ అంటే అతనికి పంచప్రాణాలు. ఒకనాడు ఆమె, అతడు పేద రైతులుగా ఉండి ఇతరుల పొలాల్లో కూలీకి పోయేవారు. వారి అన్యోన్య తను గురించి ఊరిలో అమ్మలక్కలు గొప్పగా చెప్పుకుం టారు. ఇల్లు ఎప్పుడూ కళ కళలాడుతూ వుంటుంది.హాయిగా బ్రతుకుతున్నారు ఇన్నాళ్ళు. వాళ్ళకు దిష్టి తగులుతుందేమే నని వాళ్ళ ముసలాళ్ళు భయపడుతూ ఉంటారు. అలాంటి సత్తెమ్మ వాకిట్లో ఈరోజు ఉదయం పదిమంది ఆడపిల్లలు

చేరారు. సరాసరి హుటాహుటిన హాలులోకి వచ్చారు. సత్తెమ్మ కూతురు సరోజను పిలిచారు. సరోజ నీరసంగా వచ్చి ఉయ్యాల బల్లమీద కూర్చున్నది.

ఒక అమ్మాయి అన్నది, "ఏమే సరోజా! మనరాష్ట్రం మొత్తానికి ఇంటర్మీడియట్ పరీక్షలో నీవు ఫస్టు వచ్చావని మన ప్రధానోపధ్యాయినికి తంతి వచ్చిందట నిన్నరాత్రి పదిగంటలకు. ఆమె ప్రొద్దున్నే మమ్మల్నందరినీ పిలిపించి చెప్పి నిన్ను తనవద్దకు తీసుకు రమ్మన్నారు. అందుకని వచ్చాము. ఏమిటీ! అలా డీలా పడిపోతున్నావు?" అందరు పిల్లలూ ఆమె చుట్టూ గుమిగూడారు. అభినందనలు చెప్పేవారు కొందరు. ఆప్యాయంగా కౌగలించుకునేవారు మరికొందరు. ఆమె చేతులు తమ చేతుల్లోకి తీసుకొని సంతోషాన్ని వెలిబుచ్చుతున్నవారు అనేకమంది. సరోజ సొమ్మసిల్లిపోతున్నది.

"దానికి కాస్త గాలి ఆడనీయండే, జరగండి" అని గర్జించింది ఒక విద్యార్థిని కంఠం. అందరూ ఆమెకు దూరంగా జరిగారు.

సత్తెమ్మ వంటింట్లో నుంచి పరుగెత్తి వచ్చింది. ఈ విద్యార్థుల గుంపును చూచి విస్తుపోయింది.

"పిన్నీ! సరోజ మనరాష్ట్రం మొత్తానికి ఫస్టు వచ్చింది. మాకు టీ పార్టీ ఇప్పించాలి నువ్వు" అన్నది సత్తెమ్మ అక్క కూతురు

బాగా చదువుకున్న విద్యార్థినులు సత్తెమ్మ చుట్టూ మూగారు.

"ఓస్! ఇంతేకదా మీరు కోరేది! టీపార్టీ ఏమిట్రా? ఏకంగా ఆమె స్నేహితులకు మా చుట్టాలకు బంతిపెట్టి భోజనాలు ఏర్పాటు చేద్దాం" సత్తెమ్మ ఆనందాశ్రువులు రాలుస్తూ పలికింది.

నలుగురైదుగురు విద్యార్థినులు సత్తెమ్మను కౌగలించుకున్నారు. "మా పిన్ని మనసు మహా గొప్పది. ఆమె దొడ్డ ఇల్లాలు" అని సగర్వంగా వ్యాఖ్యానించింది సత్తెమ్మ అక్క కూతురు.

ఈ గందరగోళంలో సరోజ ఎందుకు డీలా పడిపోతున్నదో గమనించలేదు అందరూ. సత్తెమ్మ కూతురు వంక చూచింది. దగ్గరగా వెళ్ళి ఆమె తల నిమిరి, "కాస్త నా మాట వినుతల్లీ! కాసిని పాలు ధారకం తీసుకో" అని బ్రతిమాలే ధోరణిలో కూతురును బుజ్జగించింది.

"ఊఁహూ! నేను త్రాగాను. నా సంగతి తేలేవరకు నేను పచ్చి మంచినీళ్ళు ముట్టను" అన్నది సరోజ.

తమ స్నేహితురాలి మాటలు విని ఆమె తోటి విద్యార్థినులు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. 'ఇంత సంతోషము సమయంలో ఈ విషాదం ఎందుకు వచ్చింది."అనే అనుమానం వారందరి మనస్సులలో ఒక్కసారిగా తళుక్కున మెరిసింది. అందరూ ప్రశ్నార్థకంగా సత్తెమ్మ వైపు

చూచారు. అది చిన్న ప్రజాకోర్టు. సత్తెమ్మ ముద్దాయి ! అన్నట్లుంది పరిస్థితి.

సత్తెమ్మ కళవళ పడింది.

"ఏమీలేదర్రా। దాని సంగతి మీకు తెలుసుగా.మంచిదే కాని మంకుపట్టు పిల్ల. పైచదువు చదువు చదువుతానంటుంది తను. చదువు ఆపి పెళ్ళి చేస్తానంటాడు వాళ్ళనాన్న, మధ్య నేను సతమతమయిపోతున్నాను" అని వాపోయింది సత్తెమ్మ. ఇంతలో సత్తెమ్మ భర్త రత్తయ్య హాలులోకి వచ్చాడు. తన కూతురు సావాసగత్తెలను చూచి ముందు ఆశ్చర్యపోయాడు. తన కూతురు రాష్ట్రం మొత్తానికి ప్రథమ స్థానంలో వచ్చిందనే వార్త తనకూ తెలిసింది బజార్లో. అభి నందించటానికి వచ్చారేమోనని భావించాడు.

రత్తయ్య అన్న కూతురు పద్మ అందరినీ నెట్టుకొని ముందుకు వచ్చింది. "బాబాయ్! ఇవ్వాళ మేము ఎంత సంతోషంగా ఉన్నామో నీకు తెలుసుగా? సరోజను చూసుకొని మేమంతా ఎంత గర్వపడుతుటామో నీకు ఇన్నాళ్ళు తెలియదా? ఎందుకు బాబాయి నీకు సరోజమీద కోపం?" అని నిలదీసి అడిగింది ఆ పిల్ల.

రత్తయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. భార్య సత్తెమ్మ వైపు చూచాడు. విషయం గ్రహించాడు. వెళ్ళి సరోజ తల నిమిరాడు. "చూడండర్రా! సరోజని ఎంత అల్లారు ముద్దుగా

గారాబంగా పెంచానో మీ అందంకీ తెలియని విషయంకాదు. అలాంటి నేను, నా సరోజమీద నా కూతురి మీద కోపం తెచ్చుకుంటానా? సరోజను నేను ఇంతవరకూ ఒక్కమాట అని ఎరగను. నమ్మండి."

రత్తయ్య అక్కకూతురుఅందుకుంది ఆయన మాటను. "మామయ్యా! మమ్మల్ని బోల్తా కొట్టించాలని ఎందుకు చూస్తావు? మాకు అంతా తెలుసు. నీవు సరోజ చదువు ఆపిస్తానన్నావు. సరోజ చదువు సాగిస్తానన్నది. నీవు కాదన్నావు. అది అన్నం మానేసింది. నీవు అన్యాయం చేస్తున్నావు మామయ్యా;" అని కళ్ళ నీళ్లు పెట్టుకుంది ఆమె.

రత్తయ్యకు దుఃఖం ఆగలేదు. ఉత్తరీయం తీసుకొని ముఖానికి అడ్డం పెట్టుకొని కుమలడం ఆరంభించాడు. "మామయ్యా! నేను తప్పు మాట్లాడానా? క్షమించు మామయ్యా" అన్నదా పిల్ల.

రత్తయ్య సంభాళించుకున్నాడు. గద్గద కంఠంతో ఇలా అన్నాడు "వినండర్రా, వినండి. నా పిల్ల చదువుకుంటే నాకు ఎంతగానో గర్వం కాదూ? పరిస్థితులకు లొంగి, సమాజానికి తలవొగ్గి నేను ఈ నిర్ణయానికి వచ్చాను. అంతేకాని, సరోజమీద ప్రేమలేక కాదు. ఆమె మా ఇంటి దీపం. నాచిట్టి తల్లి నిన్నటి నుండి పాలు కూడా త్రాగకుండా భీష్మించుకుంటే ఎదురుగా కూర్చొని ఆమె ముఖం చూచే ధైర్యంలేక పిఠతోకిపోయాను అమ్మా! నేను పిరికివాడను తల్లీ! పిరికి

వాడను. నేను ఒక్కడిని సమాజాన్ని ఎదిరించలేను." నేల మీద కూలపడ్డాడు రత్తయ్య. విద్యార్థినులలో కొంతమందికి అతనిమీది జాలి కలిగింది, కొంత మందికి మనిషిని నమిలి మ్రింగేటంత కోపం వచ్చింది.

రత్తయ్య అన్న కూతురు పలికింది కొంచెం కర్కశంగా, "బాబాయి! నీకు అంత కష్టం ఏమిటి వచ్చిందో చెప్పు వింటాం. అందరం కలసి చర్చించుకుందాం. ఫస్టున పాసయ్యే పిల్లను, రాష్ట్రి మంతటికీ గౌరవం తెచ్చే పిల్లను, మనఊరికి గౌరవ ప్రతిష్ఠలను చేకూర్చే పిల్లను చదువు ఆపేయమనటానికి నీకు నోరు ఎలా వచ్చింది బాబాయి?"

రత్తయ్య దిగ్భ్రాంతికి లోనయినాడు. కాసేపు నోట మాట రాలేదు. అటు పిల్లస్థితి, ఇటు భర్త పరిస్థితి చూస్తున్న సత్తెమ్మ క్షోభపడుతున్నది. నోటికి చీరకొంగు అడ్డం పెట్టుకొని బెక్కడం మొదలుపెట్టింది. ఆమె కళ్ళవెంట ఒకటే ధార ఆ దృశ్యం చూచిన వాళ్ళ గుండెలు అవిసిపోతున్నాయి. రత్తయ్య తన నంజాయిషీ చెప్పసాగాడు,

"వినండర్రా। వినండి. పూర్తిగా వినండి. అంతా వినండి. శ్రద్ధగా వినండి. అంతా అయిన తరువాత మీరు ఏది న్యాయమని చెప్తే అదే చేస్తాను। సరేనా?" అని అందరి వైపు అతడు సాభిప్రాయంగా చూచాడు. "నాకు తెలుసు మా మామయ్య మహా మంచివాడు. తెలిసి తప్పు చేయడు" అంది రత్తయ్య అక్క కూతురు. "భలే! భలే! బాబాయి !

అలాగన్నావు. బాగుంది. ఇప్పుడు చెప్పు నీవు చెప్పదలచు కున్నది. మేము జాగ్రత్తగా, మధ్యలో మాట్లాడకుండా వింటాము. సరేనా?" అన్నది రత్తయ్య అన్న కూతురు.

రత్తయ్య ఒక పర్యాయం భార్యవైపు చూశాడు. వెంటనే కూతురును చూచుకున్నాడు. గొంతు సవరించు కున్నాడు. "అయ్మాయిలూ వినండి నేను మీరు అనుకునేంత కర్కోటకుడిని కాను. సరోజ పెద్ద చదువులు చదవగలదు. పుట్టినింటికీ మెట్టినింటికీ పేరు ప్రతిష్ఠలు తీసుకొని రాగలదు. అందులో నాకు సందేహంలేదు. కాని...కాని ఆడపిల్ల ఎంత యినా ఆడపిల్ల, పరాయిధనం. పరాయి ఇంటికి వెళ్ళేదే. ఆమె చోటు అక్కడే. ఆడ అండే అత్తగారింట్లో. ఆడపిల్లకు పెళ్ళి ముఖ్యం. వివాహం లేకపోతే ఆమె జీవితానికి పరి పూర్ణత్వం రాదు. పెద్ద చదువులు చదివి పెద్ద ఉద్యోగాలు చేస్తున్న ఆడపిల్లలను చూస్తున్నాం. వాళ్ళకు తగిన వరులు దొరకటంలేదు. వారు వృద్ధ కన్యలుగానే మిగిలిపోతున్నారు. నా చిట్టితల్లికి అటువంటి దురదృష్టం కలుగకూడదు. నేను కట్నాలు, కానుకలకు భయపడి ఇలా మాట్లాడుతున్నానని అనుకుంటున్నారేమో! అది పొరపాటు. నా ఆస్తిలో సగం వాటా ఆమెది. ఆ విషయంలో ఢోకాలేదు. కాని మంచిమనిషి తటస్థించాలి కదా. అదీ నా భయం"

"ఇదొక్కడే కారణమా బాబాయి? ఇంకా ఏమయినా ఉన్నాయా?"

"ఉన్నాయమ్మా ఉన్నాయి. కాని అన్నిటికన్న ఇది ముఖ్యమైనది. ప్రధానమయినది."

సత్తెమ్మ అక్క కూతురుకు సరోజ అంటే ప్రాణం. వాళ్ళిద్దరికీ తనువులు వేరయినా మనసులు ఒకటే వారిద్దరి మధ్య అరమరికలు లేవు. వారిద్దరూ తమ ఆలోచనలను, భావాలను కలబోసుకునేవారు. కనుక సరోజ భవిష్యత్తు తనపైన ఉన్నట్లు భావించింది ఆ అమ్మాయి.

"బాబాయిగారూ! మిమ్మల్ని అపార్థం చేసుకున్నాం మన్నించండి. క్షమించమని కోరుతున్నాను. కాని మీకున్న భయం అనవసరం. మీ మనస్సులో ఏర్పడిన సంకోచం ఆధారరహితం.

ఇక సరోజ తెలివితేటలమీద, శ్రద్ధమీద పట్టుదల మీద మాకందరికీ, మీకూ గట్టి నమ్మకముంది. ఆ అంశం మీద రెండుమాటలు లేవు. అయితే, మీరనేది ఆడమనిషికి పెళ్ళి ముఖ్యమని. ఇప్పటిదాకా అందరమూ, స్త్రీ పురుషులందరూ అలాగే అనుకుంటున్నాము. కాలం మారింది. స్త్రీకి విద్య ఉద్యోగం, వివాహం ఇందులో ఏది ముఖ్యమని అడిగితే విద్య, ఉద్యోగం ప్రధానమనే జవాబు వస్తున్నది. ఆడపిల్ల కూడా మనిషే! ఆమెకు బుర్రలో మెదడు ఉంది. ఆలోచించే శక్తి ఉంది. ఆమెకు ప్రతిభ వుంది. శక్తి వుంది. ప్రతిమనిషి ఒక విలక్షణమయిన వ్యక్తి. అలాగే ప్రతి ఆడది ఒక వ్యక్తిత్వము కల మనిషి. ఆమెకు సంస్కారం ముఖ్యం, దానికి

సాధనం విద్య. ఉద్యోగం ఆమెకు ధైర్యాన్ని ఆత్మస్థయి ర్యాన్ని ఇస్తుంది. ఆమె ఎంత సంపాదిస్తున్నది అనేది ముఖ్యాంశం కాదు. తన మీద తను ఆధారపడగల్గుతున్నా ననే భావం ప్రధానం ఇక వివాహం అంటారా, మంచి మనిషి తటస్థిస్తే ఏస్త్రీ పెళ్లివద్దనదు. చెడ్డ మనిషితో కాపురం నరకప్రాయం. దానికన్న కన్యగా మిగిలిపోవటమే మేలు. చూస్తున్నారుగా ఆడపిల్లల ఆత్మహత్యలూ, భార్యల హత్య లూను. వినటం లేదా వరకట్న మరణాల విశేషాలు, చదవ టం లేదా పత్రికలలో భర్తలు భార్యలను పెట్టే బాధలు. అవతలి మనిషి నడత, అలవాట్లు, ఆలోచనారీతులు, పద్ధతులు ఊహాపోహాలు తెలియనిది పెండ్లాడి తరువాత నరకయాతన పడటం తెలివి తక్కువ తనం అవుతుంది. పెండ్లిచేసుకుంటా నని ఎవడో ఒకడు ముందుకు వచ్చాడు కదా అని హడా వుడిగా పెండ్లి చేసి చేతులు దులుపుకోవటం తల్లిదండ్రులు చేయాల్సిన పనికాదు. పెద్దలు మీరు,జీవితాన్ని కాచి వడబో సినవారు. మీకు నేను చెప్పగల దానిని కాదు. ఆలోచించండి. మీబోటి వారి యెదుట ఇంతసేపు ప్రసంగించగల సాహసు నాకు లేదు. చిన్నదాన్ని నేను."

మతాబు పువ్వొత్తి కాలిస్తే కాంతు లీనినట్లు విద్యార్థి నుల ముఖాలు జ్వాజ్వాల్య మానంగా వెలిగిపోతున్నాయి. అవతల పెద్దవాళ్ళు ఉన్నారని సంకోచించి ఉంటారేమో। లేకపోతే నినాదాలిచ్చేవారు.

రత్తయ్య ప్రాన్పడిపోయాడు "ఇంత చిన్న దానవు ఇన్ని విషయాలు నీకు ఎలా తెలిసాయమ్మా" అన్నాడు.

సత్తెమ్మకు ధైర్యం వచ్చింది. "మా అక్కయ్య కూతురు అంటే ఏమనుకున్నారు? పట్నంలో ఎమ్ ఏ. రెండో సంవత్సరం" అన్నది ధీమాగా.

"ఎంతగా ఎదిగావమ్మా!" అంటూ మెచ్చుకున్నాడు రత్తయ్య.

"మామయ్యా! ఒక్కమాట, నీవు సరోజ చదువు ఆపటానికి మరో కారణం కూడా ఉందన్నావు అదేమిటి మామయ్యా "ప్రశ్నించింది విమల.

"ఏందుకులే అమ్మా ఇక ఆ సంగతి?" విషయాన్ని దాటు వేద్దామని చూచాడు రత్తయ్య.

"బాబాయి! చెప్పవూ! వినాలని మా చెడ్డ కుతూహలంగా ఉన్నది. ఏమో! రేపు మానాన్న ఇలాంటి కారణమే చెప్తే ఏమి సమాధానం చెప్పాలో నేను ముందుగా ఆలోచించుకోవద్దూ?" గునిసింది.

"ఒకటికాదు రెండు కారణాలున్నాయి. ఒకదానిని చెప్తే మీరు నవ్వుతారు. రెండోదాని ఊసెత్తితే కన్నుమంటారు. ఎందుకులే అమ్మా! ఇక అడగద్దు" రత్తయ్య కాదంటున్న కొలదీ ఆశ పిల్లల పట్టుదల పెరుగుతున్నది.

ఇంతసేపూ మరాద్యగా మౌనంగా వింటూ ఉన్న పిల్లలంతా ఒక్కసారిగా చెప్పాల్సిందే అని అరిచారు.

రత్తయ్య దిగాలు పడ్డాడు. అతని పరిస్థితి కుడితిలోపడ్డ ఎలుకలా ఉంది. గుండె చిక్కబట్టుకుని "చెప్తా వినండి" అన్నాడు.

"నా అక్క కుమారుడు రంగయ్య ఇంటర్మీడియట్ ప్యాసయ్యి, పై చదువులు చదివి ఉద్యోగాల కోసం ఒకరిని ఆశ్రయించకుండా పది ఎకరాల పల్లపు భూమిని ముప్పది ఎకరాల మెరక భూమిని సాగుచేస్తున్నాడు. వాడు మంచివాడని ఊళ్ళో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు. వాడికి పిల్ల నిమ్మని మా అక్కయ్య స్వయంగా అడిగింది. కాదనలేక పోయాను అందుకని నీళ్ళు" నములుతున్నాడు రత్తయ్య.

విమలకు ఉక్రోషం వచ్చింది. "ఏమిటి మామయ్యా నీవు మాట్లాడేది. వెనుకటికి ఒకడిని తాటిచెట్టు ఎందుకు ఎక్కావురా అంటే దూడ మేతకు అన్నాట్ట. అట్లాగుంది నీ వరస. మా అన్నయ్యకు సరోజను ఇచ్చి పెళ్ళి చెయ్యటానికి సరోజ చదువు ఆపటానికి ఏమిటి సంబంధం? తేల్చి చెప్పు. మా అన్నయ్య సరోజ చదువు ఆపమన్నాడా?"

"రామరామమీవాడికే పాపం తెలియదమ్మా పిల్లచదువు ఆపమని మీఅమ్మకూడా అడగలేదు. అసలు సంబంధం కలుపుకుందామురా తమ్ముడూ అని మీ అమ్మ అన్నదేగాని అసలు పిల్ల చదువు ప్రస్తావనే రాలేదు."

ఉగ్రురాలయింది విమల. "ఇటు నా కళ్ళల్లోకి సూటిగా చూచి మాట్లాడు. నీవు చేసిన ఈ పొరపాటు పని సంద

ర్భంగా నా తల్లినీ, నా అన్నయ్యనూ ఎందుకు రంగంలోకి ఈడ్చావు. ఎందుకు వాళ్ళను అభాసుపాలు చేస్తున్నావు?"

"శాంతించవే మేనకోడలా! నేను అసలు ఆ విషయం మాట్లాడను. మీరే నన్ను బలవంతం చేశారు. ఇప్పుడు నన్ను తప్పుపట్టున్నావు నీవు. నన్ను మీరందరూ ఇరకాటంలో పెట్టారు." రత్తయ్య వివరించబోయాడు. కాని విమల వినిపించుకోతలచలేదు. ఆమె కోపం చల్లారలేదు.

"చాలు చాల్లే మామయ్యా! నీవు సంజాయిషీ చెప్పటానికి ప్రయత్నించి మమ్మల్ని అందరినీ అవమానం పాలు చేయిస్తున్నావు! మా అమ్మ లచ్చమ్మ మహిళల హక్కులకోసం నేను పుట్టకముందే పోరాటం ప్రారంభించిందట. మా నాన్న వెంకన్న బస్తీలో పెదకాపు. ఆయనంటే దొరలకు హడలట. అలాంటిది మా వంశం. మా అన్నయ్య, మా అమ్మ సరోజ చదువు ఆపటానికి కారణభూతులంటే ఎవరు నమ్ముతారు? ఇక నీ మాటలు నేను వినను, వినలేను. వెళతాను."

రత్తయ్య దిగులు ముఖంతో జాలిగా భార్య సత్తెమ్మ వైపు చూచాడు.

సత్తెమ్మ అందుకుంది. "ఇటు చూడు విమలా! మీ మామయ్య చెప్పింది పూర్తిగా వినకుండా పాపం ఆయనమీద విరుచుకు పడ్తున్నావు. ఆయన ఏం చెప్తాడో చెప్పనీ! తరువాత ఆయన తొొన్ను మాట్లాడితే మనందరం ఆయనను తప్పు

పడదాము. సరేనా! కాస్త ఓపికగా విను" అని మందలించింది. సత్తెమ్మ అంటే పిల్లలందరికీ ఎనలేని అభిమానం, ప్రేమ. ఆమె సావానగత్తె సరోజ తల్లి కదూ।

"విమలా! బాబాయిని మాట్లాడనీయవే!" అన్నది పద్మ.

"అవునులే! మీరంతా ఒక యింటిపేరు వాళ్ళుగా. కనుకనే వెనకేసుకొని వస్తున్నావు" అని ఎద్దేవ చేసింది విమల.

"ఇంతకూ అసలు కథ చెప్పనిస్తారా లేదా?" అని విసుక్కుంది జలజ.

వాతావరణంలో నిశ్శబ్దం ఆవరించింది. రత్తయ్య ఎలుగెత్తి మాట్లాడం మొదలుపెట్టాడు. "చెప్తున్నా వినండి సరోజ చదువు ఆపమని మా అక్కయ్య అడగలేదు. అసలు ఆమె ఆ ఊసే ఎత్తలేదు. నా మేనల్లుడికి మా అక్కాదమ్ముళ్ళ సంభాషణ విషయమే తెలియదు. వాళ్ళను పొరపాటుగా ఎవరన్నా అర్థం చేసుకుంటే అది అన్యాయం. ఇదంతా నా బుద్ధి జాడ్యం. నా మేనల్లుడు ఇంటర్మీడియట్‌తో ఆపేసుకున్నాడు కదా! వాడి భార్య కాబోయ్యే పిల్ల ప్లీడరీ, డాక్టరీ చదువు చదివినా, కాలేజి ప్రిన్సిపాలు అయినా వాడి మనస్సు కష్టపడుతుందేమోనని భయపడి నేనే నా సొంత తెలివి తేటలతో ఆలోచించి సరోజను కాలేజీలో చేరవద్దని అన్నాను. ఇదీ సంగతి"

"ఎంత తెలివి తక్కువవాడివి మామయ్యా నీవు? మా అన్నయ్య కాలేజీలో చేరలేదు కాని చదువు మానివేశాడని ఎవరన్నారు? సార్వత్రిక విశ్వవిద్యాలయం ద్వారా బి. ఏ. డిగ్రీ సంపాదించాడు. ఎం. ఏ.కు చదువుతున్నాడు. అయినా పెళ్ళాం చదువు ఆపించేటంత అహం, పెళ్ళాం పెద్ద చదువు చదువుతుంటే కుళ్ళి ఏడ్చేటంత-కుసంస్కారికాదుమామయ్యా మా అన్నయ్య." విమల తన మనసులోని మాటలను వెలువరించింది నిశితంగా.

"ఆ మాటకువస్తే డిగ్రీల పాండిత్యం కన్నా సంస్కారానికి సౌశీల్యానికి మా సరోజ ఎప్పుడూ పెద్దపీట వేస్తుంది." అని సరోజను వెనకేసుకొని వచ్చింది జలజ.

మబ్బు విడిపోతున్నట్లుగానే ఉంది. కాని అంధకారం తొలగిపోనట్లే. వాతావరణం శీతలం కాలేదు. అందరి మనస్సుల్లో ఇంకా ఏవో అనుమానాలు, సందేహాలు. రత్తయ్యను ఊరక వదిలే స్థితిలోలేరు ఆ ఆడపిల్లలు. పిల్లికి ఏ ఎలుక గంటకట్టాలా అన్నట్లు అందరూ ఒకరి ముఖాన్ని మరొకరు పదే పదే చూస్తున్నారు. కాని ఎవరూ మొదటి ప్రశ్నవేయటానికి సాహసించటంలేదు. కాగా సత్తెమ్మ అక్కకూతురు అందరికన్న వయస్సులో పెద్దది. ఎం. ఏ. చదువుతున్నది కదా పట్నంలో.

"రత్తయ్య బాబాయి! ఏదో చేశావు. ఏదో ఆలోచనలు చేశావు. అది సరే కాని, ఇప్పుడు తెలియజెప్పు? సరోజ ఛదువు ఆపుచేయించటానికి నిన్ను ప్రోద్బలం చేసిన ఆ

రెండో కారణం ఏమిటి? తేలిపోవాలి ఈ సమస్య ఇవ్వాళ."
స్ఫుటంగా పలికింది జలజ.

ఇందంతా వింటూన్న సరోజకు తన తండ్రిమీద జాలి పుట్టుకొని వచ్చింది. "నాన్నా ఇలారా!" అని పిలిచింది. సరోజ ఎగిరి గంతేశాడు రత్తయ్య..

తన కూతురు సరోజ తనను అపహాస్యం పాలు కాకుండా కాపాడపోతున్నదని గ్రహించాడు. ఒక్క ఉరుకున ఆమె వద్దకు వెళ్ళాడు.

"ఏం అమ్మా! నీరసంగా ఉంది కదూ! చేతులార తెచ్చిపెట్టుకున్నావు. నా బంగారు తల్లివి! కాసిని పాలు తేనా ఒక గ్రుక్కెడు, ఒక్క గ్రుక్క మాత్రమే తీసుకో తల్లీ! పాపిష్టివాడిని నిన్ను అష్టకష్టాలపాలు చేశాను." అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు రత్తయ్య.

సరోజ మెత్తబడుతుందేమోననే భయం పట్టుకుంది జలజకు.

"బాబాయ్ రెండో కారణమేమిటో విశదీకరించాలి. సరోజను ఆమె చదువుకుంటానన్నంత వరకు చదవనీయాలి. ఇందులో రాజీలేదు" అన్నది జలజ సాధికారికంగా.

"ఓసి నీ తస్సదియ్యా! నీవుటే దానికి నిరాహారం చెయ్యమని సలహా ఇచ్చింది!" విభ్రాంతికి లోనయింది సత్తెమ్మ.

రత్తయ్య రైతుబిడ్డ. ప్రపంచ జ్ఞానం అతనికి మెండుగా ఉన్నది. అతనిని అందరూ అందుకే గౌరవిస్తారు. అతడు

గ్రహించాడు. జలజ అనుమతి లేకుండా సరోజ పొలుకాదు సరికదా పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టదని. అనువు కాని చోట అధికుల మనరాదని అతనికి పెద్దలు చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. అక్కడ కూడిన ఆడపిల్లలదే పైచెయ్యి అని అతనికి తెలిసిపోయింది. ఇంక లొంగిపోవటమే మంచి మార్గం అని అతనికి తోచింది.

"జలజా! నీ కోరిక నేను మన్నిస్తాను.కారణం చెప్తాను మీరెవ్వరూ నామీద కోపపడకూడదు. నన్ను ద్వేషించరాదు. ఈ షరతు మీకు ఇష్టమయితే సరేసరి. లేకపోతే నేనూ నిరాహారం చేపట్టాను." రత్తయ్య గొంతులో దృఢత్వం తొణికిసలాడింది. "బాగానే ఉంది సంబడం. తండ్రీ కూతుళ్ళ పంతాలు నా ప్రాణానికి వస్తున్నాయి" అంది సత్తెమ్మ.

సరోజ ఉలిక్కిపడింది హీనస్వరంతో,"జలజా నాన్నను చికాకు పరచకే" అన్నది.

ఈమాత్రపు చల్లని మాటకు పొంగిపోయాడు రత్తయ్య

"బాబాయి! నీ షరతుకు ఒప్పుకున్నాం" అని చెప్పింది జలజ.

రత్తయ్య దగ్గాడు చిన్నగా. ఆతడు మాట్లాడ తల చాడని అందరూ అర్థం చేసుకున్నారు. మౌనవ్రతం తాల్చారు.

"నాకు ఇద్దరు పిల్లలన్న విషయం మీకందరికీ తెలుసు. సరోజ అన్న సోమయ్య, వాడు రెండు సంవత్సరాలనుండి

పదోక్లాసు తప్పాడు కదా। వాడు ఈ సంవత్సరం ఎట్లాగయి తేనేం ఇంటర్‌మీడియట్ ప్యాసయ్యాడు. వాడిని చదివించాలి కదా! ఎంత చెడ్డా వంశోద్ధారకుడు. ఇద్దరినీ పట్నంలో హాస్టలులో పెట్టి చదివించలేను. పోనీ పట్నంలో కాపురం పెట్టామంటే సత్తెమ్మ లేకపోతే ఇక్కడ వ్యవసాయం పడు కుంటుంది ఇద్దరు జీతగాళ్ళు, గొడ్డూ గోదా ఇవన్నీ ఆమే చూసుకుంటున్నది కదా కనుక ఆమె పట్నం వెళ్ళే ప్రసక్తి లేదు. అయినా మరోమాట నా మనసులో మెదిలింది. ఎంత పెద్ద చదువు చదివినా, ఎంత సంపాదన పరురాలయినా కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవటం లేదు ఏ కుర్రవాడు. వాళ్ళకు అన్నీ కావాలి పిల్లకు చదువుండాలి, అందం ఉండాలి, సంపాదనపరురాలు కావాలి, కొసరు క్రింద కట్నం కావాలి. ఇదీ ఈనాటి యువకుల పోకడ. లక్షలు పెట్టి చది వించి అంతకన్నా పెద్ద చదువులున్న వరుణ్ణి తేవాలంటే మరిన్ని లక్షలు పోయాలి. ఎక్కడుంది ఇంత డబ్బు నాబోటి సామాన్య రైతుబిడ్డకు. కనుక ఎప్పుడో ఇవ్వాల్సిన కట్నం ఇప్పుడే ఇచ్చి పెళ్ళిచేస్తే సరిపోతుంది. చదువుకు పెట్టాల్సిన డబ్బు ఆదా అవుతుంది. పైగా ఆడపిల్ల ఎప్పటికయినా పరాయి ఇంటికి పోయేదేకదా। సర్వం ఆమెకు దోచిపెట్టి కొడుకును బికారిని చేయటం నాకు సమ్మతం కాదు. నాకు వాళ్ళిద్దరూ రెండు కళ్ళు నేను ఇలా ఆలోచించటం తప్పా? ఇప్పుడు అనండి మీరు అనదలచుకున్నదేమిటో।"

రత్తయ్య మాటలోని తర్కం పైకి బాగానే ఉన్నట్లు కొంతమంది అమ్మాయిలకు అనిపించింది, కొందరు అమ్మా లకు విపరీతమయిన కోపం వచ్చింది. కాని, ముందుగా వాగ్దా నం చేశారు కనుక రత్తయ్య మీద కస్సుమనలేదు.

సత్తెమ్మ తనభర్త తెలివితేటలకు మురిసిపోయింది. కాని ఎందుకో ఆమెలో అసంతృప్తి గూడు చేసుకుంది. ఆమె ముఖం కళావిహీనంగా ఉంది. ఆమెలో తేజస్సులేదు. అంతే గాక ఆమెను భయం ఆవహించింది తన కూతురు బ్రతుకు ఏమవుతుందోనని తల్లడిల్లిపోతున్నది. మామూలు పద్ధతి ప్రకా రం, సంప్రదాయం ప్రకారం ఆలోచిస్తే తన మొగుడు చెప్పింది సరిపైన మాటే. సంసారపక్షంగా వచ్చే ఆలోచనే. కాని రత్తయ్య వాదనలో ఏదో లోపం ఉన్నట్లు ఆమెకు స్ఫురిస్తున్నది. ఎక్కడో తిరకాసు ఉన్నదని ఆమెకు అను మానం. అది ఏదో మాత్రం ఆమెకు తెలియటంలా. 'బహుశా జలజకు తెలుస్తుందనుకుంటా!'' అని తలపోసింది. ''జలజా! మీ బాబాయిగారు మనసు విప్పి మాట్లాడారు. కష్టసుఖాలు అన్నీ ఏకరువు పెట్టారు. మీకందరికీ ఆయన అభిప్రాయాలు ఎందుకు నచ్చటం లేదో అందరికీ తెలిసేలా వివరించు'' అన్నది సత్తెమ్మ.

సత్తెమ్మ తెలివి తేటలు, లౌక్యం ఇప్పటికిగాని రత్త య్యకు అర్థంకాలేదు అబ్బ! ఎంత గడుసరి, భర్తను పల్లెత్తు మాట అనలేదు. అయితే ఆయనను బల పరచలేదు. పైగా

ఆయనను విమర్శించమని జలజను ఎగ(త్రోసింది. అలా ఉం డాలి మనిషి అంటే, తన మనసులోనే తన భార్యకు అభినం దనలు తెలుపుకున్నాడు రత్తయ్య.

"బాబాయిగారూ! మీమీద మాకెవ్వరికీ కోపంలేదు. కేవలం జాలి మాత్రం ఉంది. మీరుగా స్వంతంగా ఆలోచించ కుండా తర తరాలనుండి వస్తున్న పురుషాధిపత్య సమాజపు భావాలను మీరు మీవిగా చేసుకున్నారు. ఆ పరిధిలోనే మాట్లాడుతున్నారు. పురుషుడు గొప్పవాడు, స్త్రీ తక్కువది అనే భావాన్ని ఒక్క పర్యాయం ఆమోదిస్తే మీ తర్కం, వాదన న్యాయమని, సమంజసమని తోస్తుంది. చిక్కు అల్లా అక్కడే వచ్చింది. తిరకాసు అక్కడే ఉంది. ఈనాడు స్త్రీని తెలివితేటలలో, బుద్ధిలో, (ప్రతిభలో, శక్తిలో, సమర్ధతలో, నిజా యితీలో దేనిలోనూ తక్కువ అంచనా వేయటం పనికిరాదు శాస్త్రం మా పక్షాన ఉంది. జీవితానుభవం మా వాదనను సమర్థిస్తున్నది. మా శక్తి యుక్తులను నిరూపించి మరీ మాట్లా డుతున్నాం. మీరే పరోక్షంగా అంగీకరించారు మా పిన్ని ఇంట్లో లేకపోతే వ్యవసాయం మూల బడుతుందని.

మీరు చెప్పిన ఒక్కొక్క అంశాన్ని తీసుకొని ఖండిం స్తాను. కుమారుడు వంశోద్ధారకుడన్నారు మీరు. ఈనాడు విజ్ఞతకల స్త్రీలు పెండ్లికాగానే తమ పుట్టింటి వారి ఇంటి పేర్లను తీసివేసి మెట్టినింటి వారి పేర్లు పెట్టుకోవటం లేదు. మీ అమ్మాయి సరోజ అలాంటిదే. మీ ఇంటి పేరే తన ఇంటి

పేరుగా వాడుతుంది. సరేనా! మీ అమ్మాయి పెద్ద శాస్త్ర వేత్త అయితే, పెద్ద తత్వవేత్త అయితే, మానవ జాతిని పట్టి పీడించే వ్యాధి నివారణకు నూతన ఔషధాన్ని కనుగొంటే ఆమెకు వచ్చే కీర్తి ప్రతిష్టలు మీ ఇంటిపేరు మీదుగానే వస్తాయి. మీ అందరికీ గర్వకారణమమవుతుంది.ఆమెనిజంగా మీ వంశోద్ధారకురాలవుతుంది.

ఇక్కడ మరో మాట మీకు గుర్తు చేయాలి. ఈనాడు చదువుకొని ఉద్యోగం చేసే స్త్రీలు తమ అన్నదమ్ములకన్నా ఎక్కువగా తమ తల్లిదండ్రులనుపోషించుకుంటున్నారు.కొన్ని కుటుంబాలలో వారే నిజానికి కుటుంబపోషకులు. తమ చెల్లె ళ్ళకోసం, తమ తమ్ముళ్ళకోసం వారు తమసుఖాలను త్యాగం చేసి, తమ వివాహాలను వాయిదా వేసుకుంటూ పోయి, చివ రకు పెళ్ళి చేసుకోవడం మానివేసిన విద్యావంతులయిన స్త్రీలను అనేకమందిని చూస్తున్నాం. పోల్చిచూస్తే, అలా కుటుంబంకోసం త్యాగంచేసే యువకుల సంఖ్య స్వల్పం, వాస్తవ విషయాలు ఇలా వుంటే తద్విరుద్ధంగా మీరు వాదిం చటం న్యాయంకాదు.

ఇక సోమయ్యను చదివించవద్దని మేము అనం. సోమయ్య మగజాతికి చెందినవాడు కనుక అంతమాత్రాన అతనిపై మాకు కోపంలేదు. అతడు తెలివికలవాడే. కాగా అతనికి దేనిలో అభిరుచి ఉందో, ప్రజ్ఞవుందో మీరు తెలుసు కొని అతనిని ఆ శాఖలో పెట్టాలి. అంతేకాని అందరికీ,

పిడుగుకూ బియ్యానికీ ఒకటే మంత్రమన్నట్లు చేస్తే మనిషి రాణించడు. సోమయ్య నాకు తెలిసినంతవరకు బొమ్మలు బాగా వేస్తాడు. అతనికి ఆ కళలో శిక్షణ యిప్పిస్తే గొప్ప చిత్రకారుడవుతాడు. అలాకాక అతన్ని మామూలు చదువు లోనో, వ్యవసాయంలోనో, వ్యాపారంలోనో పెడితే అతని ప్రతిభ ఎలా పైకి వస్తుంది? అది సరేకాని బాబాయ్! ఒక విషయం మీరు మరచిపోవద్దు. సరోజకు లెక్కలలో నూటికి నూరు మార్కులు వస్తున్నాయి. గత నాలుగు ఏండ్లనుంచి ఆమెకు అలాగే వస్తున్నాయి. ఆమె గణితశాస్త్రంలో బాగా వృద్ధికి వస్తుంది. ఇంతవరకు గణితశాస్త్రంలో కృషి చేసిన స్త్రీలు తక్కువ. గణితశాస్త్రం లేకుండా తతిమ్మా శాస్త్రాలకు ఒక్క అడుగుకూడా కదలటంలేదు. జీవశాస్త్రం మొదలు ఆర్థికశాస్త్రందాకా అన్నింట్లో అది అవసరమగుచున్నది.

నా మాట వినండి ఆమె చదువు ఆపకండి. ఇక ఖర్చు విషయం అంటారా ఆ విషయం కూడా మీకు విశదీక రిస్తాను. ఆమెకు నెలకు నాలుగువందల రూపాయల పైచిలుకు ఉపకార వేతనం ఇస్తుంది ప్రభుత్వం. అది హాస్టలు ఖర్చులు పోగా వంద పైచిలుకు మిగులుతుంది. పై ఖర్చులకు సరి పోతుంది. ఆమె చదువుకు ఆమె సంపాదించుకుంటుంది. సరేనా! మీమీద పైసా భారం ఉండదు.

ఇకపోతే కట్నం సంగతి. మీరు కట్నం ఇవ్వవద్దు. కట్నం అడిగేవాడిని మా సరోజ పెండ్లి చేసుకోదు. మేమూ చేసుకోము. అలా ప్రతిజ్ఞలు చేసాము, అంతగా అవసరం

అయితే మేము కన్యలుగా ఉండిపోతాము. ఇలా అంటూంటే మీరు భయపడి పోతున్నారు కదూ! మీరేమీ భయపడవద్దు. మేము సిగ్గు పడాల్సిన పనులు, మీకు అపకీర్తి తెచ్చేపనులు మేము ఏమీచెయ్యం. మేము ఆత్మాభిమానం కలవాళ్ళం, కనుకనే పైసలిచ్చి మొగుడిని కొనుక్కొని వాడితోసంసారం-కాదు వ్యభిచారం —చెయ్యం. ఇష్టంలేని మగాడితో బలవంతం మీద కాపురం చెయ్యటం మావ్యక్తిత్వాలకు దెబ్బ. దాన్ని మేము సహించం. అయితే సహృదయుడు, సంస్కారి గుణవంతుడు, భార్యను సమానురాలిగా భావించి, ఆదరించి గౌరవించే మనస్తత్వం కలవాడు తటస్థిస్తే తప్పక పెండ్లిచేసు కుంటాము. అతన్ని ప్రేమిస్తాం, ఆదరిస్తాం, అభిమానిస్తాం. ఆ మనిషి కోసం ఎంతయినా త్యాగం చేస్తాం. మాకూ 'నా' అనేవాడు కావాలి. ఎంతమంది వృద్ధ కన్యలు తమను అర్థం చేసుకునే వరుల కోసం ఆరాటపడ్తున్నారో మీకేమి తెలుసు. తల్లిదండ్రులుగా మీరు వరాన్వేషణకు తిరిగి మైళ్ళ దూరం చేసిన ప్రయాణాలు, పొందిన బడలిక మాత్రమే మీకు గుర్తు ఉంటాయి. కాని కన్యలమనో వేదనమీకు అర్థంకాదు. ఎందు కంటే మేము మాట్లాడం, మా మనసులో మాట వెలికిచెప్పం. కనుక మాకు అలాంటి ఆరాటం లేదనుకుంటారు మీరు. మన సరోజ లాంటి అమ్మాయిని పెండ్లి చేసుకుంటామని, కట్నం ఆశించకుండా చిల్లిపైసా మీచేత ఖర్చు పెట్టించకుండా పెళ్ళిచేసుకుంటామని అందమైన కుర్రాళ్ళు, గుణవంతులైన

యువకులు, విద్యావంతులైన పురుషులు బారులు తీరి నీఇంటి ముందుట నిల్చుంటారు బాబాయి। నీవు ఊహించుకో ఆ దృశ్యాన్ని। వాళ్ళ బెడద తప్పించమని అప్పుడు నీవు నన్నే సాయం పిలవాల్సి ఉంటుంది.

సరోజ మామూలు స్త్రీ అనుకోవద్దు రాష్ట్రానికి, దేశానికి, ప్రపంచానికి ఎనలేని సేవ చేయగల ప్రజ్ఞాశాలి: ఆ పిల్ల కడుపున నలుగురు పిల్లలు కలగాలని నీ ఆశ, అది ప్రతి స్త్రీ చేసే పని. అది నీ కూతురు సరోజ, నా స్నేహితురాలు సరోజకూడా చెయ్యనక్కరలేదు. ఏదయినా, అదంతా ఆమె ఇష్టం. మనం ఎవరం తేల్చటానికి?

ఇది విను బాబాయి! కాలచక్రం గిర్రున తిరుగుతున్నది. పాత భావాలు మారుతున్నాయి. మానవ విలువల స్వరూప స్వభావాలు పరివర్తన పొందుతున్నాయి. కనుక ఏది ముందు ఏది వెనుక అని తేల్చుకోవాలి. అంతేకాని పాతకాలపు ఆలోచనలతో, ఛాందస భావాలతో జీవితాలను శాసించడం పొరపాటు అవుతుంది.

కోపగించుకోకు బాబాయి! నాకు ఉద్రేకం వచ్చింది. అందుకని ఇంత ఊపుగా మాట్లాడాను. మామూలుగా నేను ఎంతో మితభాషిని. నేను మాటల మనిషిని కాను. కార్యవాదిని. నమస్కారం బాబాయి!"

జలజ ఉపన్యాసం ముగించగానే విద్యార్థినులు, వాళ్ళ ఉత్సాహం ఉరకలెత్తుతుంటే ఆగలేక, చప్పట్లు కొట్టారు.

సరోజ కూడా చప్పట్లు కొట్టున్నది. రత్తయ్య, భార్య ఎలా ఉందో అని చూశాడు.ఆమె కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి ఆమె అప్రయత్నంగా కరతాళధ్వనులు చేస్తున్నది. ఈ దృశ్యాన్ని చూచి రత్తయ్య కరగిపోయాడు. పశ్చాత్తాపం చెందాడు. పూట్లాడబోయాడు. మాట పెగల్లేదు గొంతులో నుంచి అతని పెదవులు "సరోజా!" అనిపిలుస్తున్నట్లున్నాయి. అందరూ అతన్ని చూచారు. గంభీరమైన వాతావరణం అలముకున్నది. ఒక్క క్షణం నిశ్శబ్దం ఆవరించింది.

"జలజా! నీవు నాకన్న చిన్నదానివై పోయినావు. లేక పోతే నా కళ్ళు తెరిపించినందుకు నీకు నమస్కరించేవాణ్ణి. నీవు చెప్పినట్లు సోమయ్యనుపట్నం పంపించి చిత్రకళ నేర్పిస్తా! సరోజను ఆమె ఇష్టం వచ్చినన్నినాళ్ళు చదువుకోమంటా!"

"నాన్నా!" అని సరోజ ఆర్ద్ర హృదయంతో కేక పెట్టింది.

"ఎన్నాళ్ళకు నీవు మనిషివయ్యావయ్యా!" అంది సత్తెమ్మ.

ఒకవైపు అతడు తన కుమార్తెకు న్యాయం చేయ బోతున్నాడని సంతోషం, మరొకవైపున తన కుటుంబంలో అశాంతి తొలగిందని హర్షం ఆమెను ఉక్కిరి బిక్కిరి చేస్తు న్నాయి.

రత్తయ్య ఆడపిల్లలవైపు తిరిగి,

"మరి మీరు పూర్వంలాగానే మన్నిస్తారా?" అని అడి గాడు.

"అదేమిటి మామయ్యా! మేమెవరం నీ వాళ్ళంకదూ! నీకు సరోజ ఒకటీను మేము ఒకటీనా? మా సరోజను నీవు కాదంటే మేమూ నిన్ను కాదన్నాం. నీవు ఆమెను ఆదరిస్తే నిన్ను మునుపటిలాగానే గౌరవించుకుంటాము" అంది విమల.

"బాబాయి! నిన్ను మార్చినందుకు జలజను మనందరం అభినందించాలి!" అని ప్రతిపాదించింది పద్మ. జున్నుతో నిండిన గిన్నెను, చెంచాను అందించింది సత్తెమ్మ జలజకు.

"జలజకు జై" అన్నది విమల.

"ఆగండి. ఇది మహిళా లోకానికి విజయం. "మహిళాభ్యుదయం కావాలి" అనేది మన నినాదం కావాలి" అన్నది జలజ.

"మహిళాభ్యుదయం కావాలి" అని అరిచింది పద్మ "కావాలి" అన్నారు అందరూ. సత్తెమ్మ, రత్తయ్య, సరోజల గొంతులు స్పష్టంగా వినిపించాయి.

"పిన్నీ! గ్లాసెడు పాలుతెచ్చి బాబాయికియ్యి" అనడిగింది జలజ. అడిగిందే తడవుగా సత్తెమ్మ పాలగ్లాసును రత్తయ్యకు అందించింది.

రత్తయ్య ఉయ్యాల బల్లను సమీపించి "సరోజా!" అన్నాడు.

"నాన్నా!" అంటూ తండ్రి ఒడిలో వాలిపోయింది సరోజ. "కాసిని ఈ పాలు త్రాగమ్మా!" అని ప్రతిమాలాడు రత్తయ్య.

గ్లాసు చేతిలోకి తీసుకొని అమ్మ వైపు చూచింది. సరోజ సత్తెమ్మ చేతిలో అప్పటికే రెండో గ్లాసు ఉంది. దానిని సత్తెమ్మ కూతురుకు అందించింది. సరోజ రెండో గ్లాసులో పాలు నింపి తండ్రి చేతికిచ్చి త్రాగమంది. "ముందు నీవు.." అన్నాడు రత్తయ్య. కూతురు ముందు, తరువాత తండ్రి పాలు త్రాగారు.

"కూతురూ, తండ్రీ రెండు రోజులనుండి ఏమీ తిన కుండా త్రాగకుండా కుమిలిపోయారు" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది సత్తెమ్మ.

ఈ సమాచారం విని ఆడపిల్లలంతా ఆశ్చర్యంలో మునిగిపోయారు. రత్తయ్య కఠినుడని, కర్కోటకుడని అను కున్నారు కాని అతనికి సరోజపై అంత ప్రేమాభిమానాలు ఉన్నాయని వారూహించలేదు.

అందరూ లేచి రత్తయ్యకు నమస్కరించారు.

రత్తయ్య సత్తెమ్మ వైపు చూచాడు.

"పల్లెత్తు మాట పలకకుండా, కంటిచూపుతో, నన్ను మార్చింది ఆమె" అన్నాడు రత్తయ్య.పిల్లలంతా సత్తెమ్మను చుట్టుముట్టి కౌగలించుకున్నారు."ఇంతలో మహిళాభ్యుదయం వర్ధిల్లాలి" అన్న పురుషకంఠం వినిపించింది. అది రత్తయ్యది కాదు. ఎవరా అని అందరూ చుట్టూ చూశారు. హాలు లోకి అడుగుపెడ్తూ సోమయ్య కనిపించాడు.

"మీ అందరికీ, మా సరోజ స్నేహితులందరికీ నా అభినందనలు, కృతజ్ఞతలు" అన్నాడు సోమయ్య.

"కృతజ్ఞతలు ఎందుకో చెప్పుకో!" అని నిలదీసింది విమల.



"ఎందుకా! మీ పట్టుదలవల్ల సరోజ చదువు సాగుతున్నది. నాకు చిత్రకళా అబ్బుతుంది. అందుకూ!" సమాధాన మిచ్చాడు సోమయ్య.

"ఇప్పటికి మహిళాభ్యుదయం వల్లనే పురుషాభ్యుదయం కూడా సాధ్యమని పురుష జాతి గ్రహించింది" అని స్పష్టీకరించింది జలజ.

ముసి ముసినవ్వులు నవ్వుతున్నది సత్తెమ్మ. సరోజ ముఖం కాంతివంతమై ప్రకాశిస్తున్నది. రత్తయ్య తృప్తిగా చిరునవ్వు నవ్వుతున్నాడు.

"మహిళాభ్యుదయం వర్థిల్లాలి! స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించాలి! అనే నినాదాలతో దద్ధరిల్లిపోయింది ఆ ప్రదేశమంతా.

## శిక్షణా కేంద్ర సాహిత్యం

| | | |
|---|---|---|
| 1. | స్త్రీలకు ప్రత్యేక సమస్యలు వున్నాయా? | 2-00 |
| 2. | మానవ హక్కులు; మహిళల హక్కులు | 2-00 |
| 3. | స్త్రీల హోదా ; వివక్ష | 2-00 |
| 4. | వరకట్న మరణాలు : నిషేధ శాసనాలు | 2-00 |
| 5. | స్త్రీలపై అత్యాచారాలు | 3-00 |
| 6. | మతం ; మూఢ విశ్వాసాలు | 3-00 |
| 7. | మత సమాజాలు ; మహిళలు | 1-00 |
| 8. | మత ధర్మశాసనాలు ; మహిళలు | 3-00 |
| 9. | కుల సంకెళ్ళు | 2-00 |
| 10. | వివాహ వ్యవస్థ | 2-00 |
| 11. | ఆడది : వంటపని, ఇంటిచాకిరి | 2-00 |
| 12. | ఇల్లాలి ఇంటిపేరు ఎందుకు మారాలి? | 2-00 |
| 13. | ప్రేమ వివాహాలు సఫలత చెందాలంటే | 3-00 |
| 14. | సామాజిక పరిణామం | 1-50 |
| 15. | జాతీయ సమైక్యత | 1-50 |
| 16. | హేతువాదం | 3-00 |
| 17. | హ్యూమనిజం : స్త్రీ విమోచన | 2-00 |
| 18. | స్త్రీ విముక్తి నూతన సిద్ధాంతం | 2-00 |
| 19. | కామన్ సివిల్ కోడ్ : స్త్రీలు | 2-00 |
| 20. | సెక్సు అపోహలు | 2-00 |
| 21. | సాత్యంలో స్త్రీ పాత్ర చిత్రణ | 2-00 |
| 22. | మహిళా దశాబ్దం ; సాధించిన విజయాలు | 2-00 |
| 23. | ప్రపంచ స్త్రీల స్థితిగతులు : పోరాటాలు | 2-00 |
| 24. | మహిళోద్యమ చరిత్ర ; అభివృద్ధి | 2-00 |
| 25. | మహిళాభ్యుదనికి మహిళా పత్రికలు | 2-00 |
| 26. | వివాహం ; దాంపత్య జీవితం | 2-00 |
| 27. | ప్రజాస్వామ్య వ్యవస్థ : స్త్రీలు | 2-00 |
| 28. | మాతృత్వం ; శిశుపోషణ ; కుటుంబ నియంత్రణ | 2-00 |
| 29. | ప్రజోద్యమాలు ; మహిళోద్యమాలు | 2-00 |
| 30. | ఫెమినిజం అవసరమా? | 2-00 |
| 31. | లైంగిక విప్లవం | 3-00 |